# స్మృత్యంజలి



"కవిని దర్శిస్తే అతని కవిత్వం ఏపాటిదో తెలుస్తుంది.
అతని కవిత్వం స్పృశిస్తే ఆ కవి ఎలాంటివాడో తెలుస్తుంది" అన్న మాటలు పుట్టి ఎల్లయ్య దృష్టిలో అక్షర సత్యాలు.

నీతిని, నిజాయితిని తన ఆభరణాలుగా ధరించిన పుట్టి ఎల్లయ్య 1935 సంవత్సరం మే 18న పాలమూరు నగరంలో జన్మించారు. విద్యాభ్యాసమంతా ఇక్కడే కొనసాగించి. కో-ఆపరేటివ్ బ్యాంకులో ఉద్యోగం సంపాదించి, 1958లో సబ్ రిజిస్ట్రారుగా చేరి, డిప్యూటీ రిజిస్ట్రార్‌గా 1993లో పదవీ విరమణ పొందారు.

పుట్టి ఎల్లయ్య మంచితనం మూర్తీభవించిన మానవతామూర్తి, ఆత్మీయత, అప్యాయతలు కలబోసిన అనురాగమూర్తి, ఆయనది సుకుమార స్వభావం. ఆయన మృదు స్వభావి. హాస్యప్రియుడు. సౌజన్యశీలి. అహందరిచేరని నిగర్వి.

వృత్తి పట్ల క్రమ శిక్షణ, అంకితభావం కలిగిన పుట్టి ఎల్లయ్య తన వృత్తిని దైవ సమానంగా భావించి నష్టాల్లో కూరకుపోయిన కో-ఆపరేటివ్ బాన్యకును లాభాల బాటలో పయనింపజేసి అధికారుల ప్రశంసలు అందుకున్నాడు. తమ బ్యాంకు అధికారులు ఎవరైన పదవీ విరమణ పొందిన సందర్భంలో వారిని తన ఆశుకవితా ఊయలలో ఓలలాడించేవాడు. ఆ విధంగా కో-ఆపరేటివ్ బ్యాంకు ఆస్థాన కవిగా కూడా పేరు తెచ్చుకున్నాడు. అందుకు వారిపై వ్రాసిన ఆయన కవితలే నిదర్శనం.

పుట్టి ఎల్లయ్య గారితో నా పరిచయం ఆయన జీవిత చరమాంకంలో కలిగింది. ఆయన దగ్గరికి ఎప్పుడు వెళ్ళినా 'ఏమోయ్. . .! పల్లీ. . .భీంపల్లీ. ." అని ప్రాస ఉపయోగించి పలకరించడం, ఆ పిలుపుకు నన్ను నేనే తన్మయత్వం చెందడం జరుగుతుండేది. నన్ను ఓ పిగ్గా కూర్చోబెట్టుకొని తను వ్రాసిన కవితల్ని వినిపించడం. . . ఆ వినిపించడంతోనే తన సాహితీ పరిమళాన్ని వెదజల్లడం. . . అలా మా పరిచయం మూడు వసంతాలు గడవకముందే . . . మృత్యువు ఆయన ఆత్మను కబళించడం. . . ఆయన అనంత తీరాల్లోకి వెళ్ళిపోవడం. . . ఏక కాలంలో జరిగిపోయాయి. పుట్టి ఎల్లయ్య ఈనాడు మన మధ్యన లేకున్నా. . . ఆయన పంచిన జ్ఞాపకాలు ఉన్నాయి.

పుట్టి ఎల్లయ్య 2000, ఆగష్టు 9న అకస్మాత్తుగా ఈ లోకాన్ని వదిలాడు. అందరి కళ్ళల్లో నీళ్ళు నింపాడు.

మరలిరాని లోకానికి వెళ్ళిపోయాడు - మళ్ళీ రానంటూ ! సుదూర తీరాలకు పయనమయ్యాడు . . . ఇక సెలవంటూ !

అందుకోవయ్యా ఎల్లయా! ఈ అంజలి నీదేవయ్యా !

అక్షరాంజలితో

**భీంపల్లి శ్రీకాంత్**

# అంజలి



## పుట్టి ఎల్లయ్య

# అంజలి

1

రచన

పుట్టి ఎల్లయ్య

సంపాదకుడు

భీంపల్లి శ్రీకాంత్



పాలమూరు సాహితి

మహబూబ్‌నగర్

# అంజలి

రచన : పుట్టి ఎల్లయ్య

సంపాదకుడు : భీంపల్లి శ్రీకాంత్

మొదటి ముద్రణ : ఆగష్టు, 2001

ప్రతులు : 1000

ముఖ చిత్రం : కార్టూనిస్ట్ రమేశ్



ప్రచురణ సంఖ్య : 1

ప్రచురణ : పాలమూరు సాహితి, మహబూబ్‌నగర్.

వెల : రూ॥ 25/-

ప్రతులకు :

1. శ్రీమతి శంకరమ్మ,
   ఇంటి నెం. : 1-5-106/2,
   న్యూటౌన్, మహబూబ్‌నగర్ - 509001.
2. అధ్యక్షులు,
   పాలమూరు సాహితి,
   ఇంటి నెం. 8-5-10/12,
   టీచర్స్ కాలనీ, మహబూబ్‌నగర్ - 509 001.

డి.టి.పి. : మానస గ్రాఫిక్స్, న్యూటౌన్, మహబూబ్‌నగర్.

ముద్రణ : మైత్రి ఆఫ్‌సెట్ ప్రింటర్స్, మహబూబ్‌నగర్.

# నిత్యజీవనమే మార్గదర్శనం

నిలబడి అడుగులు వేయలేని పసిప్రాయంలో చేయూతనందించి మా తప్పటడుగులు తప్పకుండా సరిచేసి యుంటారు మా నాన్న. మా నాన్నే కాదు, ఏ తండ్రి అయినా ఆ పని చేస్తారు. కాని, జీవిత పర్యాంతం "నిజాయితీ, నిరాడంబరత" అనే రెండు విషయాలను మొక్కవోని నిబద్ధతతో తాను అమలు పరిచి మాకు మార్గదర్శనం చేసారు మా నాన్న. నిజాయితీగా జీవించాలని ఏ ఒక్క రోజు మాకు పాఠం చెప్పే ప్రయత్నం చేయలేదు మా నాన్న. కాని నిరంతరం నిజాయితీగా ఉండటం ఎలా? అనే విషయం ఆయనను దగ్గరగా చూసిన మాకు బాగా అర్థమయ్యేది. సహకార శాఖలో డిప్యూటీ రిజిస్ట్రార్ హోదాలో పనిచేశారు. ఆయన పని చేసిన అన్ని ఆఫీసులలో ఆయనకున్న పేరు నిజాయితీ. ఇంట్లో ఆర్థిక ఇబ్బందులు ఎదుర్కొన్నప్పుడు మా నాన్న జీతం సరిపోవడం లేదని నొచ్చుకునే వాళ్లం. కాని డిపార్ట్‌మెంట్‌లో తోటి అధికారులు ఎల్లయ్య గారు నిజాయితీకి నిలువుటద్దం అని, లంచాలు పుచ్చుకోరని చెప్పకుంటుంటే విని ఉప్పొంగేవాళ్లం. కళ్లెదుట కట్టలు (నోట్లు) విసిరేసిన సంఘటనలు మేము మరిచిపోలేం. వనపర్తిలో తాను ఉద్యోగం చేస్తున్నప్పుడు మహబూబ్‌నగర్ నివాసి అయిన ఒక రాజకీయ నాయకుడు ఇంటికొచ్చాడు. ఈ కానుక తీసుకోండి, పనిచేయండి అని పెద్దవి రెండుకట్టలు ఓ పేపర్లో చుట్టి ఇచ్చారు. లంచం అని గుర్తించి తేరుకున్న మా నాన్న ఆయన ముఖంపై విసిరేసారు. వచ్చిన దారి వెళ్లి పొమ్మని పురమాయించారు. ఇలాంటివి ఇంకా కొన్ని సంఘటనలు మా ముందే జరిగాయి. మా నాన్న పోట్లాటకు దిగడం మేము చూడలేదు. ధైర్యం, బలం ప్రదర్శించే సంఘటనలు ఎప్పుడూ జరగలేదు. అయితే కోరి వస్తున్న నోట్ల కట్టలనుఅలా అలవోకగా విసిరివేయడమే ఆయనకున్న ధైర్యం. అక్రమార్జనకు ఆమడ దూరంలో ఉండడం నిజంగా సాహసం కాదంటారా?

సహకార బ్యాంకులో పనిచేసేటప్పుడు ప్రభుత్వం ఇచ్చిన జీపు ఆయనకుండేది. జీపులో తిరగాలనే మోజు మాకు బాగా ఉండేది. జీపులో తీసుకెళ్లి సినిమా హాలు దగ్గర, స్కూల్ దగ్గర వదిలివేయమని ఎన్నోసార్లు బ్రతిమాలే వాళ్లం. కాని ఒక్కరోజూ మా కోరిక తీర్చలేదు. అది ప్రభుత్వ జీపు. వ్యక్తిగత పనులకు దానిని ఉపయోగించరాదని బుద్ధి చెప్పేవారు. మార్కెట్‌కు సైకిల్‌పై వెళ్లేవారు. మా నాన్న ఒట్టి అమాయకుడని అప్పట్లో

అనుకునేవాళ్లం, మనసులోనే ఎంతో బాధపడే వాళ్లం. కాని పెద్దయ్యాక తెలిసింది, ఆయన వ్యక్తిత్వం ఎంత గొప్పదో అని. చాణుక్యుడు, మోక్షగుండం విశ్వేశ్వరయ్య లాంటి మహా పురుషుల జీవిత గాథలు చదివినప్పుడు వారు ప్రభుత్వం ఇచ్చిన దీపం సహితం వ్యక్తిగత అవసరాలకు వాడరాదని పుస్తకాల్లో చదువుతుంటే గాని అర్థమయ్యేది - మా నాన్న జీవితం సాధారణం కాదు - అసాధారణమని, అమాయకుడు కాదు - అసాధ్యుడని, సాధారణమైన జీవితం జీవించడం అంత సాధారణమైన విషయం కాదని!

మచ్చుకు రెండు సంఘటనలతో మా నాన్నగారిని పరిచయం చేశాం. గురువు లభించే వరకు భజనే ఆయన ఆధ్యాత్మిక బలం. దాసరిపల్లె స్వామి ఆయనకు ఆధ్యాత్మిక గురువు. అపారమైన దైవభక్తి. అలాంటి భక్తి ప్రపత్తులు కలిగిన మా నాన్న ఆ భక్తిని తన మనసులో దాచుకోకుండా అక్షరాలలోకి నివేదించారు కూడా. అలా, అలా అక్షరాలన్నీ భక్తి కవితలుగా ఒదిగిపోయాయి. కేవలం భక్తి కవితలే కాకుండా, దేశభక్తిని ప్రతిబింబించే కవితలు, జానపదుల జీవద్భాష అయిన జానపద గేయాలను, తను సహకార బ్యాంకులో పనిచేసినప్పుడు రాసిన వీడ్కోలు కవితలు ఎప్పడూ మా స్మృతి పథంలో మెదులుతూనే ఉంటాయి. అలా వ్రాసుకున్న కవితలు, గేయాలు ఎన్నో చెప్పడం కూడా కష్టం. అయితే వాటిని ఏనాడూ ఎక్కడా ముద్రించలేదు. కేవలం వ్రాసుకొని, భద్రపరచుకున్నాడే తప్ప వాటికి ఒక రూపాన్ని కలిగించలేకపోయాడు. ఆయన బ్రతికున్నప్పడు తన కవితలకు ఒక రూపం ఇచ్చివుంటే తనూ ఒక కవిగా వెలుగొందేవాడేమో!

మా నాన్న గతించాక ఆయన జ్ఞాపకార్థం వాటికి ఒక రూపాన్ని ఇవ్వాలనే ఆలోచనతో ఆత్మీయ మిత్రులు, రచయిత అయిన **శ్రీ భీంపల్లి శ్రీకాంత్** ను కోరడం జరిగింది. అందుకాయన వెంటనే ఒప్పేసుకుని ఈ కార్యరంగంలోకి దిగారు. వాటి ఫలితమే'**అంజలి**' ఆవిర్భావం.

ఈ '**అంజలి**' వెలుగు చూసేందుకు సంపాదక బాధ్యతలను స్వీకరించిన **శ్రీ భీంపల్లి శ్రీకాంత్** కు, ఈ'**అంజలి**' కి తమ అభిప్రాయాలను వెలిబుచ్చిన పెద్దలకు, ఈ '**అంజలి**' వెలుగుచూడడానికి సహకరించిన అందరికి కృతజ్ఞతలర్పించుకుంటూ . . .

తేది : 22-7-2001 — **పుట్టి మురళీమనోహర్**

పాలమూరు — **పుట్టి రామ్ మోహన్**



# "మా పుట్టి . . . మహాగట్టి"



పుట్టి ఎల్లయ్య గారు నాకు దాదాపు మూడు సంవత్సరాలుగా తెలుసు. ఈ మూడు సంవత్సరాలలో ఎన్నిసార్లు కవిత్వం గురించి, సమాజం గురించి చెప్పాడో, ఎన్నిసార్లు భక్తి గురించి, తత్త్వం గురించి వివరించాడో అంతేలేదు. అలా చెప్పడంలో ఆయనలో ఒక జ్ఞాని కనిపిస్తాడు. ఆయనలో ఒక భక్తుడు కనిపిస్తాడు. ఒక గడుసరి కనిపిస్తాడు. ఒక స్నేహితుడు కనిపిస్తాడు. ఆయన ఒక తత్త్వవేత్తగా దర్శనమిస్తాడు. ఒక మానవతావాదిగా మనల్ని స్పృశిస్తాడు. ఆయన చెప్పడమే కాదు - అలా చెప్పాలనుకున్న తన అభిప్రాయాలను కలం ద్వారా లోకానికి చాటి చెప్పడమే కాదు, అక్షరాలతో అందరినీ అభిషేకించాడు కూడా.

పుట్టి ఎల్లయ్య గారు కొన్ని శతాబ్దాలుగా ఎన్నో వందల కవితలను, గేయాలను రాసుకొని లిఖితంగా భద్రపరచుకున్నాడే తప్ప, ఏనాడూ ప్రచారానికి ఉపయోగించుకోలేదు. ప్రచారం అంటే ఆయనకు అసలు గిట్టదు. అందుకే తను కవితలు, గేయాలు రాస్తానని ఏనాడూ చెప్పకోలేదు. ఏ వేదికా ఎక్కలేదు. అంతటి స్థితి ప్రజ్ఞుడాయన. అంతటి కర్మయోగి ఆయన.

పుట్టి ఎల్లయ్య మనస్సులాగానే ఆయన కవితలు కూడా సుకుమారమైనవి, సుమధురమైనవి. చదువుతూంటే అలవోకగా చదవనిస్తాయి. సరళమైన పదాలతో, మృదుమధురమైన భావాలతో ఆయన కవితలు పఠితుల మనస్సులను దోస్తాయి. అలతి అలతి పదాలతోనే మనందరిని తన అక్షరాంజలితో అభిషేకిస్తాడు.

ఆయనలో కనిపించని దైవత్వం ఉంది. ఆ దైవత్వంలో మూర్తీభవించిన మానవత్వం ఉంది. ఆయనొక మనీషిగా, తత్త్వవేత్తగా, మానవతావాదిగా, కర్మయోగిగా, అంతకుమించి ఆదర్శవాదిగా కనిపిస్తాడు.

ఈ "అంజలి"లో భక్తి కవితలు, సామాజిక కవితలు, జనపదోక్తి

కవితలు ఉన్నాయి. ఇవి వేటికవి సాటి. ఆయన కవిత్వంలో ప్రధానంగా కనిపించే గుణం, నన్ను ఆకర్షించే లక్షణం అంత్యప్రాసలు. పదాల పొందికలో ఆయన కూర్చిన వైనం అమోఘం. దానిలో భావం అనన్యం. అందుకు ఆయన కవితలు నిదర్శనం. ఆయన కవితలు ఒక రకంగా గేయ సమన్వితం.

1

ఎల్లయ్య గారికి భక్తి ప్రపత్తులు మెండు. అందుకే ఆయన రచనల్లో భక్తి భావం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. తెలుగు సాహిత్యంలో కవులందరూ తమ కావ్యాలకు ముందుగా ప్రార్థన గేయాలు రాయడం ప్రాచీనంగా అలవాటే. ఎల్లయ్య గారు కూడా తన కావ్య రచనను ప్రార్థన గేయంతోనే ఆరంభించారు. ప్రతిరోజూ సుప్రభాత సమయంలో దైవ ప్రార్థనను స్తుతిస్తూ పారాయణం చేస్తున్నామంటూ ఆ దేవుణ్ణి ప్రార్థిస్తాడు. కలికాలమైన ఈ కలియుగంలో పాపపంకిలాన్ని కడిగివేయమని ఆ పాండురంగడిని పదేపదే వేడుకుంటాడు. నవనీతచోరుడైన బాలకృష్ణుడి చిలిపి చేష్టలను లలితమైన పదాలతో రమ్యంగా వర్ణిస్తాడు.

పుట్టి ఎల్లయ్యకు రామభక్తుడైన హనుమంతుడంటే ఎనలేని ప్రీతి, భక్తి. హనుమంతుడి వాలాన్ని అభివర్ణించుటకు పదాలు చాలవంటాడు.

"వాలం అంటే వీరులకు అనుభూతి

వైరులకు కలిగించును భీతి"

అంటూ ఒకే ఒక్క వాక్యంలో హన్మంతుని వాలం విశిష్టతను, దాని ప్రాముఖ్యతను వివరిస్తాడు.

"ఆపదలు బాపుటకై అంజనేయుడవై వెలసితివి

బాధలు బాపు బాంధవుడవై దాసరిపల్లె దేవుడవైతివి"

అంటూ వేముల గ్రామానికి సుమారు రెండు కిలోమీటర్ల దూరంలో ఉన్న దాసరిపల్లె హనుమంతుడిని స్మరిస్తాడు.

ఇలా తన భక్తి కవితల్లో సీతారాముణ్ణి, వేంకటేశ్వరుణ్ణి, హరిహరుణ్ణి



తలుస్తూ ఈ లోకం నుండి నాకు విముక్తి ప్రసాదించమంటూ ఆ దేవ దేవుణ్ణి ప్రార్థిస్తాడు.

2

ఇక సామాజిక కవితలకు వస్తే పుట్టి ఎల్లయ్య గారికి దేశభక్తి ఎంత వుందో అతని కవితలే వెల్లడిస్తాయి.

"నా దేశం మిన్న - ఏ దేశం కన్నా"

అంటూ భారతదేశం ఔన్నత్యాన్ని చాటుతూ,

"హిమగిరి పర్వతాలు

కైలాస శిఖరాలు

సజీవ సోయగాలు

నా తల్లి కిరీటాలు"

అంటూ భరతమాత కీర్తిని ప్రపంచానికి చాటుతాడు. భారతజాతిని కీర్తించమంటూ భారతీయుల హృదయాల్ని ఆత్మీయంగా స్పర్శిస్తాడు.

భారతదేశానికి స్వాతంత్ర్యాన్ని సాధించిపెట్టిన మహాత్మాగాంధీ గురించి ఒక ప్రక్క గాంధీజీ గొప్పతనాన్ని వర్ణిస్తూనే, మరోప్రక్క గాంధీపైనే వ్యంగ్యంగా తన అక్షరాలను సంధించాడు. గాంధీ అడుగుజాడల్లోనే నడుస్తున్నామనే రాజకీయ నాయకులు, ఆ అడుగులకు ఎలా మడుగు లేస్తున్నారో విపులంగా వివరిస్తాడు. రాజకీయ నాయకులకు

"పాదయాత్ర అంటే ఎంతో ఇష్టం

కాని కారు లేకుంటే అడుగులేయడం కష్టం"

అంటూనే మంచి మాటలు చెప్పి ప్రజల్ని ఎలా మోసం చేస్తున్నారో వర్తమాన భారతాన్ని చిత్రీకరిస్తాడు ఎల్లయ్య. బాపు భక్తులమంటూ రాజకీయ నాయకులు ఎన్ని పాట్లు పడుతున్నారో వ్యంగ్యంగా చెబుతూనే అంతే అర్థవంతంగా అక్షరాలను పాడిగారు.

తన కో-ఆపరేటివ్ డిపార్ట్‌మెంట్‌లో ఎవరైనా అధికారులు పదవీ విరమణ చేశారంటే అక్కడ పుట్టి ఎల్లయ్య ప్రత్యక్షం కావటం - అతని

కవిత్వం వారి మెడలో అక్షరాలంకరణాభిషేకం గావించడం ఒకేసారి జరిగిపోతాయి. కారణం, కో-ఆపరేటివ్ బ్యాంకుకు పుట్టి ఎల్లయ్య ఆస్థానకవే కావటం అందుకు కారణం. కో-ఆపరేటివ్ బ్యాంకు అధికారులంటే పుట్టి ఎల్లయ్యకు ఎంతటి గౌరవ ప్రపత్తులంటే వారి గురించి వ్రాసిన రచనలే నిదర్శనం. ఒకసారి డిప్యూటీ రిజిస్ట్రార్ పదవీ విరమణ చేస్తున్న సందర్భంలో

"మా డి.ఆర్.
మాకెంతో డియర్
మా హృదయాలకు నియర్"

అంటూ అందరిని తన్మయత్వ పరచే పదాలతో అక్షరాల్ని పొదగడం ఆయనకు వెన్నెతో పెట్టిన విద్య. అలాగే బ్యాంకు అభ్యున్నతికి వారు పాటుపడిన తీరును కూడా ఎంతగానో ప్రశంసిస్తారు. వారి కార్యదీక్షతకు జోహార్లర్పిస్తారు. ఎవరైనా పదవీ విరమణ చేస్తున్నారంటే ముందుగా పుట్టి ఎల్లయ్య కాదు బాధపడేది - అతడి అక్షరాలు. ఆ అక్షరాలతోనే వారిని అభిషేకించి, ఆర్ద్రహృదయుడై పోతాడు. అంతటి సున్నిత మనస్కుడు పుట్టి ఎల్లయ్య.

నాగరికత పెరిగిన కూడా సభ్యత, సంస్కారాల్ని సమాజం ఇంకా అలవరచుకోలేదని ఆగ్రహంగానే ఆక్రోశిస్తాడు.

"పేదవాని బ్రతుకు
అంబటి గంజి గతుకు"

అంటూ పేదవాడి జీవిత చిత్రాన్ని తన కలం కుంచెతో చిత్రీకరిస్తాడు. నీతి నిజాయితీ గల పేదవాడిని యోగిగా, కర్మయోగిగా అభివర్ణిస్తాడు. అలాగే విద్యార్థి చేయవలసిన కర్తవ్యాన్ని కూడా ప్రబోధిస్తాడు.

తను చేస్తున్న వృత్తిలో ఎన్నో చాటుమాటు వ్యవహారాలు జరుగుతున్న తీరును నిరసిస్తూ,

"నిజం చెబుతా
ముమ్మాటికి నిజం చెబుతా
నింగి విరిగి మీదపడ్డా
నిజం చెబుతా"



అంటూ తనలో రగిలే ఆక్రోశానికి అక్షరాలంకరణ గావిస్తూ, అన్యాయాన్ని, అధర్మాన్ని కడిగేస్తానని శపథం చేస్తాడు.

హరిజనులు పడుతున్నపాట్ల గురించి, వారి బాధల గురించి చెప్పాలనుందంటాడు పుట్టి ఎల్లయ్య.

"చెప్పాలని వుంది
నాకు చెప్పాలని వుంది
దీన జనుల బాధల గురించి"

అంటూ వారుపడే బాధల గురించి, వారెలా నికృష్టపు జీవితాన్ని గడుపుతున్నారో మనవతావాదిగా దర్శించి, వారి జీవితాన్ని స్పృశిస్తాడు.

తన సహకార సంఘం గురించి చెబుతూ

"చేయి చేయి కలపాలి
చేయూతగా నడవాలి"

అంటూ ఐక్యమత్యంగా జీవించాలని, చైతన్యపు బాటలోన నడవాలని పథ నిర్దేశం చేస్తాడు. అలాగే రైతులు సహకార సంఘాన్ని ఆశ్రయించి లాభం పొందాలని, రైతు బాగుపడితే దేశం బాగుపడుతుందని వారిని ఉత్తేజపరుస్తాడు. పుట్టి ఎల్లయ్య "తత్త్వవేత్త"గా దర్శనమిచ్చే కవిత "నువ్వు-నేను"

"నువ్వు ఎవరు?
నేనెవరు?
నువ్వంటే నేను
నేనంటే నువ్వు
ఇంకీ మనమెవరం?"

అనే తత్వం ఇందులో దాగి ఉంది. నువ్వు-నేను ఒకటే అనే భావం ఈ కవిత్వం నిండా పరుచుకుంది. ఈ కవిత్వం చదివితే పుట్టి ఎల్లయ్య ఎంతటి తత్త్వవేత్తనో మనకు తెలుస్తుంది.

మన శత్రువులు ఎవరూ కాదు-మన మనస్సే అంటూ మనస్సు చేసే అల్లరి అలజడిని, చంచలత్వాన్ని బహిర్గతం చేస్తాడు.

"అట్లేనంటావు గాని
అదే దారి వెళ్తావు"

అంటూ ఎన్నిసార్లు మనసుకు నచ్చజెప్పినా అది వినదంటూ మనసు మర్మాన్ని రమ్యంగా ఉద్బోదిస్తాడు.

3

పుట్టి ఎల్లయ్యకు జానపదుల భాష అంటే, జానపద గేయాలంటే మరీ ఇష్టం. అందుకే తన జానపద గేయాల్లో

"బాలి వస్తనంటే
బంగుల కట్టిపిస్తి
బాలి రాకపాయె
బంగుల కూలిపాయె"

అన్న వసంత వైరాగ్యం ఒకేసారి దర్శనమిస్తాయి. చిన్నచిన్న పదాలతోనే అర్థవంతమై భావాల్ని అక్షరీకరిస్తాడు పుట్టి ఎల్లయ్య

అలాగైనా రంగైన రంగిని తన బావ ఏమంటున్నాడో చూడండి.

"జామపండ్లు తెచ్చి నా రంగి
జాముకే నీకిస్తి నా రంగి
దోసపండ్లు కోసి నా రంగి
దోసుకా తెచ్చిస్తి నా రంగి"

అంటూ తన మరదలిపై ఉన్న ప్రేమనంతటిని ఈ గేయంలో ఒలకబోస్తాడు. రంగి రూపాన్ని చూసి తను నిలువునా నీరయ్యానని, బంగారు వన్నెల రంగి సింగారాన్ని ఏమందునంటూ తనలో తానే తన్మయత్వం చెంది సిగ్గులమొగ్గవుతాడు.



"గలా గలా నవ్వింది నా గంగి
నన్ను గమ్మత్తు సేసింది నా గంగి"

అంటూ గంగి చేసిన సరసాల్ని కొంటెగా, గంగి చెప్పిన బాసల్ని ముద్దుగా కవిత్వీకరిస్తాడు.

నాగులపల్లి సంతలో కలిసిన నాగి తన బావతో ముద్దుముచ్చట్లాడి ప్రేమలోకి దించిందని ఆ బావామరదళ్ల ప్రేమని ముచ్చటగా జానపద గేయాల్లో అందంగా వర్ణిస్తాడు.

బావా మరదళ్ల మధ్య ఉండే అనుబంధాన్ని, అభిమానాన్ని, అనురాగాన్ని జానపద గేయాల్లో సరళమైన భాషను వాడి పఠితుల గుండెల్లోకి జారిపోతాడు పుట్టి ఎల్లయ్య. పాడుకోవడానికి, వినడానికి వినసొంపుగా ఉన్నాయి ఈ గేయాలు.

పుట్టి ఎల్లయ్య జీవించి ఉన్నప్పడే ఈ 'అంజలి' వెలుగు చూసి వుంటే ఎంత ఆనందపడునో? ఎందుకంటే ఏనాడూ ఆయన తన రచనల్ని ముద్రణలో చూసుకోలేదు. ఆయన దివికేగి వత్సరం గడుస్తున్న సందర్భంగా ఈ "అంజలి" వారికి కానుకగా సమర్పించడం ముదావహం.

"పాలమూరు మట్టిలోని మాణిక్యం మా పుట్టి ఎల్లయ్య
పాలమూరు పసిడి రత్నం మా గట్టి ఎల్లయ్య"

భాష్పాంజలితో . . .

తేది : 4.6.2001
పాలమూరు

భీంపల్లి శ్రీకాంత్
అధ్యక్షులు
పాలమూరు సాహితి



# సహకార కవిత్వం

పాలమూరు జిల్లా సాహిత్యచైతన్యం ఈనాటిది కాదు. గద్వాల, వనపర్తి, ఆత్మకూరు, గోపాల్‌పేట, కొల్లాపూర్ తదితర సంస్థానాల పోషణలో సాహిత్యం వికసించింది. స్వాతంత్ర్యానంతరం కూడా ఈ వికాసం ఇదే విధంగా కొనసాగుతూ వస్తున్నది. స్వాతంత్ర్యానంతర కాలంలో ఎందరో తెలుగుపండితులు, భాషా వైజ్ఞానిక శాస్త్రజ్ఞులు, ఉద్యోగులు తమ కలాలతో పాలమూరు సాహితీ క్షేత్రాన్ని దున్ని రాజనాల పంటలు పండిస్తున్నారు. అక్కడక్కడ జానపద కళా సంప్రదాయ సాహిత్యమూ తొంగిచూస్తున్నది. ఒకటి రెండు ప్రాచ్య కళాశాలల్లో అధ్యయనానుశీలనాలు చేసిన యువకులు సృజనాత్మక రచయితలుగా, పరిశోధకులుగా నిలదొక్కుకోవడం జరిగింది.

పాలమూరు రచయితల సంఘం, జాతీయ సాహిత్య పరిషత్ తదితర సంస్థలు సాహిత్య కార్యక్రమాలు నిర్వహించి రచయితలను ప్రోత్సహిస్తున్నాయి. సమాజంలో సాహిత్యపరంగా అభిరుచిని పెంపొందిస్తున్నాయి. రచయితలు ఆయా వేదికల మీద తమ గళాలను వినిపిస్తున్నారు.

ఆ దిశలో **శ్రీ పుట్టి ఎల్లయ్య** గారు సహకార శాఖలో పనిచేస్తూ కాలానుగుణంగా స్పందిస్తూ ఈ కవితలు వ్రాశారు. దాదాపుగా ఇవన్నీ అయా సందర్భాలలో వేదికల మీద వారు చదివినవే.

ఇందులో భక్తి కవితలున్నాయి, శక్తి కవితలున్నాయి, రక్తి కవితలున్నాయి, జానపదోక్తి కవితలున్నాయి.

"సుకవులు చెప్పిన కవితా
నికరములు శిలాక్షరముల నిలకడ గాంచున్
కుకవులు చెప్పిన కవితా
నికరములు జలాక్షరముల నీచత నణగున్"

అని **మడికి సింగన** తన **సకలనీతి సంగ్రహం**లో అన్నారు.



"ఇమ్మహిని మునులచే వెల
సెమ్మను కావ్యములు "నానృషిఃకురుతే కా
వ్య"మ్మను వచనార్థంబే
సమ్మతి కలివేళ సుకవిజనులే మౌనుల్"

- అని **అప్పకవి** అన్నారు. కలికాలం కాబట్టి ఋషి కాని వాడు కావ్యం వ్రాయలేడు అనలేం. ఋషులు వ్రాసినవి వేరు, కలికాలంలో రచయితలు వ్రాసేవి వేరు. వాటి శ్రోతలు, వీటి శ్రోతలు పండితులూ, పామరులూ అందరూ. వారి వారి యోగ్యతలను బట్టి కావ్యార్థమర్మాలను గ్రహిస్తారు.

**ఇ. ఏ. గ్రేనింగ్ లాంబ్రన్** అంటారు . . ."సామాన్యునికి ప్రకృతి యథాస్థితిలోనే కనిపిస్తుంది. కవికది అపూర్వ సౌందర్యముగా భాసిస్తుంది". . .అని.

"కవిత్వం దేవతానుగ్రహ సంపాద్యం" అంటారు **ప్లేటో**. "కవి ముఖత: పలుకునది భగవంతుడే, కవిత దైవదత్తం" అని **గ్రీకుల** భావన.

"కవిర్మనీషీ పరిభూః స్వయంభూః". . .అంటూ కవి పరమాత్మే అన్నమాట. ఇది **ఈశవాష్యోపనిషత్తు** లోనిది.

ఆధునిక కాలంలో వ్యాస, వాల్మీకి, భాస, కాళిదాసాదులు కనిపించక పోవచ్చు. వారిలా సాధన చేసినవారు, చేస్తున్నవారు అక్కడక్కడ ఉండవచ్చు.

అయితే భావస్పందనలు అందరికీ ఉంటాయి. ఆయా సందర్భాలలో అవి బహిర్గతమవుతాయి.

"కవనీయం కావ్యమ్" - వర్ణింపదగినది కావ్యం అన్నారు **అభినవగుప్తులు**. "కవయతీతి కవిః తస్య కర్మ కావ్యమ్"-వర్ణించే వాడు కవి, అతని కర్మ కావ్యం అన్నాడు **విద్యాధరుడు**.

ఆ పద్ధతే ఈ కవితల్లో కనిపిస్తుంది. ఈ క్రింది భక్తి కవితలో ఉన్నది రచయిత వేదనే.

పాపమనే పంజరంలో
పట్టుపడేనా పాదం
ఆపాద మస్తకం
అలసిపోయె నా హృదయం
మకరిశిరం ఖండించి
కరివేల్పును కాచినట్లు
కనికరము జూపి
కాపాడవా ఓ దేవా!
రావా మహానుభావా!

కల్మషాత్తమైన వాతావరణంలో మనిషీ కొట్టుకుపోతాడు. అప్పుడు ఏదో దివ్యశక్తి తనను ఉద్ధరించాలని ఆశిస్తాడు. ఆ వేదనే పై పంక్తుల్లో కనిపిస్తుంది.

"అంజనీతనయా హన్మంతా - నా
చెంతనుండవా ధీమంతా!" - అని భజిస్తారు.
"శ్రీ రఘునందన శుభకరచరితా
వందనములందుకో గోవిందా!"-అని ఆలాపిస్తారు.
"దీనుల బాధల బాపుటకై
దాశరథివై నీవు వెలసితివి
దాసరిపల్లి ఆంజనేయులను
దయతో నీవు కాచినావట!"

అని పరమాత్మని కరుణను ఆపేక్షిస్తారు. దాసరిపల్లె దేవుడవైతివి అని న్వదేశీ అభిమానాన్ని చాటుకొంటారు. వేంకటేశ్వరా నీకు వందనములంటూ తమ "డి.ఆర్." ని (అధికారిని) కూడా కాపాడాలని ప్రార్థిస్తారు. నామం స్మరించుమంటారు. కామం వర్జించుమంటారు. "నామ్ జప్‌తే రహో! కామ్ కర్‌తే రహో!" అని హిందీలో ఒక మంచి మాటుంది. 'కస్త్వం కోఽహం' అని ఆదిశంకరుల మార్గాన్ని అనుసరిస్తూ "నువ్వెవరు!" అని ప్రశ్నిస్తూ ఓ కవిత వేదాంత పరంగా అందించారు.

"తారంగం తారంగం" అని చిన్నప్పుడు పాడించినట్లుగా



"ఆనందం - ఆనందం
రామ నామమే ఆనందం
రంగని భజనే ఆనందం
రాగంతాళం ఆనందం"
అని ఆనందంగా పాడుకొంటారు.

ఇక శక్తి-రక్తి కవితల్లో ఎన్నో సామాజికాంశాలున్నాయి. అడుగడుగునా సహకారశాఖా ప్రియత్వం కనిపిస్తుంది. సహకార వృక్షం అంటే తీయ మామిడిచెట్టు. ప్రభుత్వ సహకార శాఖ అంటే ప్రజలను ఆదుకొనే శాఖే. అందుకే కవితల నిండా **"సహకారశ్రీ"** యే ఉంది.

చివరి జానపదోక్తుల్లో పాలమూరు జిల్లా బాణీల్లో నడిచే జానపద గీతాలున్నాయి. ఇలా వ్రాసిన వాటిని ఆధునిక జానపద పరిశోధకులు అనువర్తిత జానపదాలక్రింద (Applied Literature) చేరుస్తున్నారు. పాడడానికి యోగ్యమైన అనువర్తిత జానపద గేయాలు వారందించారు.

**శ్రీ పుట్టి ఎల్లయ్య** గారు ధన్యులు. వారి నిర్యాణానంతరం వారి పుత్రమిత్ర, సాహిత్య బంధువులు వారి రచనల్లోని కొన్ని యేరి సహకార సౌజన్యం ప్రకటిస్తున్నారు. ఇది కారం కాదు, ఉపకారం. అపకారం కాదు సహకారం. వారెందరి సహకారం అందుకున్నారో గాని వారు తమ అక్షరాలతో ఎందరినో అమరులను చేసే దివ్య సహకారం అందించారు. అందుకొన్న వారికి, ఈ పుస్తకాన్ని లోకానికి అందిస్తున్నవారికి అందరికీ ధన్యవాదాలు.

భవదీయ

**డా॥ కసిరెడ్డి**

కార్యదర్శి,
జాతీయ సాహిత్య పరిషత్,
ఆంధ్రప్రదేశ్

భాగ్యనగర్
తేది : 2001, జులై 10.



# నాలుగు మాటలు

శ్రీ పుట్టి ఎల్లయ్య మనసు గీసిన గీతలు ఈ గీతాలు.

ఇందులో మూడు భాగాలున్నాయి. భక్తి గేయాలు, ధేశభక్తి, వీడ్కోలు గేయాలు, జానపద గేయాలు. అలాగే కమనీయ స్నేహఝురి జాలువార్చిన కవితలు కొన్ని.

లలితంగానూ, లయ ప్రధానంగానూ సాగిన ఈ గ్రంథ రచనలో వేదన, నివేదన, ఆత్మీయత, అనురాగం, ఆవేశం, శృంగారం కలగలిసి నిండుగా ఉన్నాయి.

ప్రార్థనతో ప్రారంభమైన ఈ గేయాల్లో దానరిపల్లె హన్మంతుణ్ణి; వేంకటేశ్వరుణ్ణి; సీతారాములని; హరిహరులని . . .భక్తితో అర్చించారు. "నువ్వెవరు?" అంటూ అద్వైతం ప్రబోధించారు. ఇంతేకాక,

"నిజం చెబుతా
ముమ్మాటికీ
నిజం చెబుతా
నింగి విరిగి మీదపడ్డా
నిజం చెబుతా"

అంటూ మనసులోని భావాలకి అనుభూతి రంగువేసి గేయాలుగా అభివర్ణించాడు.

దేశం పట్ల భక్తి భావన కనబరుస్తూ అ భ్యుదయం ఆకాంక్షించారు.

'దరిద్రుల దుఃఖాన్ని దునిమేస్తా
కడగండ్లను కడిగేస్తా'

అంటూ 'పేదవాడు' కవితలో - పూరింటి గుడిసె నివాసం చేసినా, అంబటి గంజికి అంకితమైనా - నీతి నిజాయితీ వదలడనీ, ధర్మం విడిచి కదలడని



అతనొక కర్మయోగి అని వర్ణించాడు. అయితే, ఆ బ్రతుకు అంతేనా? అని కాకుండా వాడి ఔన్నత్య గమ్యాన్ని కవి సూచించి ఉంటే మరింత అర్థవంతంగా ఉండేది.

శ్రీ పుట్టి ఎల్లయ్య 'స'రసహృదయులు. అందుకు తార్కాణం వారి కలం చిందించిన జానపదగేయాలు. అంశం, ఆలోచన ఒక్కటిగాగానే ఈ గేయాల్లో కన్పించినా బాలి, నా గంగి, నాగి గేయాలు పాడుకోవడానికి అనుకూలంగా, పాడితే వినడానికి ఇంపుగా ఉన్నాయి.

విభిన్న భావ సంపుటి ఇది. వీరి ఆత్మానందాన్ని, ఆలోచనల్ని సాలోచనగా, రస హృదయంతో మనమూ భాగం పంచుకోవడం వల్ల సార్థకతను పీఠం వేసినవారమవుతాం.

సాగండి మరి!

తేది : 31.5.2001.

మహబూబ్‌నగర్ 'ఉమ్మెత్తల'

# కృతజ్ఞతలు

"కవి అంటే కనిపించకుండా వినిపించేవాడు" అని ఆర్యోక్తి. ఈ మాట పుట్టి ఎల్లయ్య గారికి అక్షరాల సరిపోతుంది. తన మనసులోని భావాల్ని, అభిప్రాయాల్ని అందంగా అక్షరాల్లో పొదిగి, వాటిని రత్నరాసులుగా తన దగ్గర భద్రపరుచుకున్నాడే తప్ప ఏనాడూ వాటికి ఒక ఆకారం ఇవ్వలేదు. ఎల్లయ్య గారు ఉన్నప్పుడు ఇదే మాట వారి దగ్గర అంటే నవ్వి ఊరుకున్నాడు.

పుట్టి ఎల్లయ్య గారు భౌతికంగా మన మధ్య లేకపోయినా, వారి కుమారులు, ఆత్మీయ మిత్రులు పి. మురళీ మనోహర్ గారు తన తండ్రి రచనల్ని ఎలాగైనా వెలుగులోకి తీసుకురావాలనే తలంపుతో వారి రచనల ముద్రణా బాధ్యతను నాకు అప్పగించారు. దాని ఫలితమే 'అంజలి' ఆవిర్భావం. ఈ 'అంజలి' ఆవిర్భావానికి ముందునుంచి చేదోడు వాదోడుగా ఉంటూ అది కార్యరూపం దాల్చడానికి అన్ని విధాలా సహాయ సహకారాలందించిన **శ్రీ పి. మురళీ మనోహర్** గారికి,

సహృదయంతో ఈ 'అంజలి'కి 'సహకార కవిత్వం' పతాకనెంచిన **ఆచార్య కసిరెడ్డి వెంకటరెడ్డి** (ఉస్మానియా విశ్వవిద్యాలయం) గారికి,

ప్రముఖ కవి, రచయిత నాలుగే నాలుగు మాటలు రాసిన సాహిత్య వేదిక వ్యవస్థాపకులు **శ్రీ ఉమ్మెత్తల** గారికి,

చక్కని ముఖ చిత్రం రూపకల్పన చేసిన చిత్రకారులు **కార్టూనిస్ట్ రమేశ్** గారికి,

అందంగా డి.టి.పి. చేసిన బి. వి. రమణ (మానస గ్రాఫిక్స్) గారికి,

ఆకట్టుకునే రీతిలో పుస్తకాన్ని ముద్రించిన **మైత్రి ఆఫ్‌సెట్ ప్రింటర్స్** గారికి.,

సంపాదకుడు





## 1. ప్రార్థన

సుప్రభాతమున
స్తుతియించనెంచి
మ్రోలనిలిచితిమి ఓ దేవా!
మనసులోన భక్తి నిల్పి
కొలువ వెలసితిమి ఓ దేవా!

కరుణజూపు శరణు నీదే
కలిమిలో వేరొండుగలదా
శిరము నీచరణాల నిలిపి
ముదముతో మేము మ్రొక్కెదము

నిజము మాలో వెలయనిమ్ము
నిత్య సత్య భాషణా
న్యాయ, ధర్మముల నడువనిమ్ము
నగధరా నారాయణా!





## 2. వినవా నా గాథా

ఓనా హృదయాంతరంగ
ప్రత్యక్షా పాండురంగ
వినవా నా గాథా
సర్వేశ్వరా, స్వబాధా
ఓనా రాజా
సర్వలోక పూజా!

ఆకాశం అంధకారం
అగ్నిమయం భూగోళం
భగ్గుమనే జ్వాలలో
మండిపడే నా దేహం

నిర్లక్ష్యం చూపబోకు
నీ పక్షమే నాకు దిక్కు
ఓ నా దెవా
సర్వలోక పూజా!

పాపమనే పంజరంలో
పట్టుపడే నా పాదం
ఆపాద మస్తకం
అలసిపోయే నా హృదయం

మకరి శిరం ఖండించి
కరివేల్పును కాచినట్లు
కనికరము జూపి
కాపాడవా ఓ దేవా
రావా మహానుభావా!

మాయ మోసంబులో
మూర్ఖమతి నైతినేను
కామ క్రోధంబులో
కృంగిపోయే నా మేను
కలియుగములోన నన్ను
కామితార్థముల నొసగ రావా
ఓ నా దేవా
ఓ మహానుభావా!





## 3. నల్లని వాని జాడ

నల్లనివాడు లేడు
నవనీతచోరుడు రాడు
ఇల్లంత వెదికినానే
ఊరంత జూచినానే!

చిన్నారి పడుచువాడు
ముల్లోక చంద్రమరేడు
కనరాడు వీధి నీడ
మటుమాయ మయ్యినాడె!

గలగల గజ్జెలు మ్రోయ
బింబాన నాదంబియ్య
రంగైనా వాడు జారె
రాడాయె ఇంకానైనా!

పసివాడు చిన్నవాడు
ముసిముసి నవ్వులరేడు
మసకేసి వెళ్ళినాడె
మరుగైనా లేదె జాడ!

## 4. హన్మంతుని వాల

హన్మంతుని వాలం
అభివర్ణించుటకు చాలదు
పదజాలం
వాలం అంటె అందరికి మక్కువ
చెప్పడానికి పదాలు తక్కువ
అది చూస్తేనే మాకు ఎంతో బలం
స్పందించిన హృదయాలకు చలం
వాలం అంటే వీరులకు అనుభూతి
వైరులకు కల్గించును భీతి
వనజులకు ఎంతో ఆనందం
వాయునందనునికి అభినందనం
వాలం వెనుక వుంది ఎంతోగాథ
కురిపించును సదా ఆనందసుధ
కల్గినది లంకేశ్వరుని అహంభావం
వానర వీరునికి అవమానం
కపిరాజు పెంచె అతనితోక
నులిమెను రాక్షసుల పీక
వాలం చేసిన తంట
లంకా నగరమంతమంట
లంకా నగరమే దహనం
రావణుడు గోల్పోయెసహనం





రామరావణులకు పోరు
సంభవించెను మహాజోరు
శ్రీరామునికంతిమ విజయం
అసురేంద్రునకు పరాజయం
రణమున వాలము యొక్క పాత్ర
చేసెను రాక్షసుల క్షతగాత్ర
వాలం చూస్తేనే వైరులకు భయం
కల్గించెను కిరాతకులకు విస్మయం
చెప్పనవసరం లేదు వాలం పేరు
భూత, ప్రేత, పిశాచములు పరారు
వాలం అంటే మాకు ఎంతో ప్రేమ
వందనం ఓ వాయుపుత్ర బలభీమ
కరుణించిగావు ఈ దీనుల
కపిరాజు ఉద్ధరించు బలహీనుల
వాలమే మాకు అండదండ
అది వుంటే చాలు కడుపునిండ
వానర వీరుని కాలం
వెలగాలి కలకాలం
దాసరి పల్లెలో వెలసిన దేవా
దయజూపుము మహానుభావా!

## 5. అంజని తనయా

అంజనితనయా హన్మంతా
నా చెంతనుండవా ధీమంతా
అంజలినెత్తియు ఆరాధింతును
ఆపదలో నన్ను ఆదుకొందువే ॥అం॥

రామదూత రమ్మంటాను
మాకు రామ నామ మిమ్మంటాను
రామ నామముతో రాళ్ళను దేల్చియు
రాక్షస మూకల రంగుబాపితివి ॥అం॥

కరుణజూపవే కపిరాజ
నిన్ను కోరి వేడితిని కాపాడ
కలియుగంబున కల్గిన దైవమా
కలిమినిచ్చియు కరుణజూడమే ॥అం॥

ఆపదలు బాపుటకై
ఆంజనేయుడవై వెలిసితివి
దాసరిపల్లె మహానుభావయని
దయతో మము కాపాడవేడితిని ॥అం॥





## 6. శ్రీ రఘునందన

శ్రీ రఘునందన, శుభకర చరితా
వందనములందుకో గోవిందా!

నీపదముల నమ్మిన దాసులనెన్నడు
దూరముసేయకు రఘునందా!

కొందరు గలడని, కొందరు లేడని
కొండల మందురు జగదీశా!

నిండుగ పర(బహ్మాండము నంతట
దండిగ వెలసిన ధరణీశా !

## 7. రామ నామము

రామనామము తలుదామా
ఇటురమ్మని మనము పిలుదామా
వేగవేగ వనజాక్షుని పదమున
వందనములివెయని వరంబులిమ్మని ॥రామ॥

ధరణిలోన నీవే దయా నీదేయని
దేవదేవుని వేడుదమా
దండి దండము దీనావనయని
ధనధాన్యంబులు నిండుగ ఇమ్మని ॥రామ॥

కరుణ జూడుము కంసారియని
కథలు చెప్పుతు పొగడుదుమా
కామితార్థములు మాకొసగుముయని
కోసలవాసుని కోరివేడుదమా ॥రామ॥

మీపద సాక్షిమిము గొలుతుముయని
పూనిక మనము జేయుదమా
మాయ మర్మముల మమకారంబుల
మర్దనజేసి మమ్ము ఏలుమని ॥రామ॥

దీనుల బాధల బాపుటకై
దాశరథివై నీవు వెలిసితివి
దాసరిపల్లి ఆంజనేయులను
దయతో నీవు కాచినావట! ॥రామ॥





## 8. వనరాజ

వనరాజ వానరనాయక
హన్మంతా ధీమంతా
కరి వరదుని పదములు శిరసావహించిన
కపివర మునివర ధీరప్రభాకర ॥వన॥

లంకవంక బిగుదుంకితి లంకిణి
రంకెలెంకలా లంకిణి ద్రుంచిన
మంటతోకనిడి మింటకెగిసి
నడిఇంట దుమికి పెనుమంటలు జేసిన ॥వన॥

మాత సీతగని దూత రామనని
దైత్యకంతమున హంతకుమార్చిన
భల్లానిపల్లెలో పెల్లుగ ఝల్లుగ
వెలిసిన మల్లెపూల రాజిల్లు ప్రభాకర ॥వన॥

## 9. అమ్మ చూడవే . . .

అమ్మచూడవే హన్మంతుడు
అమ్మమ్మ చూడవే ధీమంతుడు ॥అమ్మ॥

కొలచిన వారికి కోమలదేవుడు
తలచిన వెంటనే త్వరలో వచ్చును
పిలిచిన పల్కెడి పవనసూనుడె ॥అమ్మ॥

రామభక్తుడె, రామ విధేయుడు
కామక్రోధముల బాపెడి దేవుడు
కామితార్థముల నొసగె అజేయుడు ॥అమ్మ॥

పేదల పాలిటి పెన్నిధియయ్యి
బాధల బాపు బాంధవుడయ్యి
దాసరిపల్లె దేవుడవైతివి ॥అమ్మ॥





## 10. వేంకటేశ్వరా

వేంకటేశ్వరా
నీకు వందనములు
ఎంతో అభివందనములు
నీ కరుణాకటాక్షమున
మహబూబ్‌నగర్‌లో
మా ప్రియనగరంలో
మెట్టుగడ్డ ప్రాంతమున
ముమ్మాటికి, మేటిగడ్డ ప్రాంతమున
నీ పేర వెలసెనొక కాలనీ
నీ దయ వల్లే వెలయాలనీ
నీ అనుగ్రహమున
మా ఎందరో సోదరులకు
మా యొక్క మాన్యులకు
జన సామాన్యులకు
గృహములు గల్గినవి
నీ అపార కృప చేత
మాకు ఆదరణీయులు
మరి అత్యంత ఆత్మీయులు
మా యొక్క ఆఫీసర్
మా యొక్క వెల్‌విషర్
ఐనా జోగయ్యగారికి

నిలువ మేడ గల్గినది
వెలయ వసతి వెలిసినది
దేవా మహానుభావా
నీ కరుణాకిరణములు
నీ చల్లని చూపులు
ప్రసారించి, ప్రజ్వలించి
నీ నగరమున వెలిసిన
నిన్నే నిండుగ నమ్మిన
మా హితులను
మా స్నేహితులను
మా మిత్రులను, వారి పుత్రులను
మా వారిని శ్రీవారిని
డి.ఆర్.ని
ఇప్పుడు అప్పుడనక
ఎల్లప్పుడు వీడక
కావగ వేడెదను
దయతో కొనియాడెదను





## 11. శ్రీ సీతారామ

శ్రీ సీతారామ
శ్రీ పరంధామ
నీ అనుగ్రహం చేత
నీ దయచేత
నీ నామధేయాన
నీ అనురాగాన
సహాయాధికారిగా
'కృష్ణ' వచ్చెను
ఆణిముత్యంవోలె
ఆశ్రిత జనులకు
ఆదర్శప్రాయమై
ముందంజవేసెను ॥శ్రీ సీతా॥

మూడు వత్సరములు
ముగిసినవో లేవో
మా మనోరథాలు
తీరకమునుపే
అది ఏదో వార్త
అందించినేడు
ట్రాన్స్‌ఫర్ 'కృష్ణా'కు
అనగా విన్నాము
అంతఃకరణములోన
ఆవేదనగల్గెను

హృదయకుహరంలోన
ఉన్న వ్యథేమో
బాధగా తోచెను
బరువాయె మనసు
వియోగమేమో విద్యుక్తమాయె
'వీడ్కోలు' ఏలా?
'వేడుకలు' ఏలా? ॥శ్రీ సీతా॥

శ్రీ సీతారామ
శ్రీ సుగుణధామ
చల్లని చూపులతో
మెల్లగా చూచి
అల్లంత దూరమున
కరగు మా ఆఫీసర్ను
ఝల్లున బ్రోచియు
జయముల గూర్చి
వరముల నొసగియు
వేదనల దీర్చి
ఆరోగ్యము నొసగియు
ఆనందమిచ్చి
ప్రేమతో చూసియు
ప్రమోషన్ లిచ్చి
భాగ్యముల నొసగ
భద్రాచల వాస ॥శ్రీ సీతా॥





## 12. నామం స్మరించు

నామం స్మరించు
కామం వర్జించు
నామం స్మరించి
నారాయణుని ధ్యానించు
నీలోన నీతి నిల్పి
నిజాయితి వెల్గించు ॥నామం॥
అనృతం విసర్జించి
అసురత్వం త్యజించు
అమృతంను గ్రోలిగ్రోలి
అమరుడవై ఏతెంచు ॥నామం॥
కల్మషాలు కాలుష్యాలు
కదిలించి ఝళిపించి
కరుణారస భావాలు
కణకణములో నించు ॥నామం॥
తనువే నేనన్న
భ్రమలను తొలగించు
తమముల త్రుంచివేసి
తారలను వెల్గించు ॥నామం॥
పంచాక్షరి పఠియించు
నిరక్షర కుక్షినించు
అష్టాక్షరి జపించి
అష్టమదముల అణిచియుంచు ॥నామం॥

## 13. నువ్వెవరు?

దేవున్ని నమ్ము
శివుడే నీ సొమ్ము
జగం మిథ్య
వచ్చింది మధ్య
ఆత్మ అనాది
దైవం పునాది
దేహం గేహం
దైవం విగ్రహం
వస్తువులు మస్తు
కల్గించును విస్తు
వ్యసనం మోజు
తీరదు ఏ రోజు
ఆశ అనంతం
లేదు అంతం
తరగని దాహం
తీరని నిరీహం
ఆకలి మెండు
పరికించిన చెండు
కామం వదలదు
క్రోధం విడువదు
మదములు అణగవు





ముదములు బరువగు
సంసారం నిస్సారం
చెయ్యకు తాత్సారం
ఆలుబిడ్డలు
చింపిరి గుడ్డలు
చుట్టాలు పక్కాలు
అంబరపు చుక్కలు
ఎవరికి ఎవరు
కారు, మరెవ్వరు
నిజం ఎవ్వరు
కనుక్కో నువ్వెవ్వరు
దేవుడు, జీవుడు
నీవే శివుడు!

## 14. పాదము

పాదమునమ్ము
గురుపాదమునమ్ము
వాదము చేయక
పాదము నమ్ము
గురుపాదమునమ్ము ॥పాద॥

పాదమే వేదము
తొలుగు నిర్వేదము
పాదమే పరము
లేకున్న ఇతరము
కాదునీ తరము ॥పాద॥

పాదమే పావనము
పాదమే జీవనము
పరమాత్మ భావన
కల్గించు సతతం
పాదము నమ్ము
పరమాత్మ నమ్ము ॥పాద॥

పాదము నమ్మిన
పరమసోపానం
అమృత పానము
అమరగానం





దివ్య జ్ఞానముల
దివ్వెగా వెలుగు ॥పాద॥

పాదమునమ్ము
పాదమే నీ సొమ్ము
లేకున్న దమ్ము
మన్ను, దుమ్ము
మనసును ఇమ్ము
మనిషిగావమ్ము
పాదమునమ్ము
పరమాత్మ నమ్ము ॥పాద॥

పాదమే ప్రేమ
అనురాగ సీమ
ఆత్మలో ఎరుక
కల్గించు వెనుక
పాదమే జీవం
పాదమే శివం
పాదమే స్వరం
పాదమే స్వర్గం ॥పాద॥

## 15. భగవాన్!

భగవాన్!
నువ్వంటే నాకు ఇష్టం
కాని తెల్సుకోవడం కష్టం
నువ్వెక్కడున్నావో విచారించా
నీ గురించి నిరతం ఆలోచించా
నీకై నేను విలపించా
నీకై అహర్నిశం కలవరించా
నీజాడ తెల్సుకోవడం కష్టం
ఐనా నీవంటే నాకు ఇష్టం
నీ అనురాగం అపారం
నీ మమకారం మహాసంద్రం
నీ ప్రేమ ఒక ప్రవాహం
ఆస్వాదించడానికి అనంతం
ఐనా నీవంటే నాకెంతో ఇష్టం
నీ ఉనికి బహుదూరం
అఖిల జగతికి ఆధారం
నీ శక్తి అనూహ్యం
నీ భక్తి అపురూపం
నీవే నాకు ప్రాణం
నీవంటే నాకెంతో ఇష్టం





## 16. చింతించు

దేవుని గూర్చి చింతించు
దేహము గూర్చి వర్జించు
దీనుల బాధల గుర్తించు
ద్రవ్యము చింతన వర్జించు
దేశము బాగు గమనించు
ద్రోహుల చెంపను వర్జించు
ప్రజలకు మేలు తలంచు
పరులకీడునుత్తరించు
వలపు చింత పరిత్యజించు
పుణ్యకార్యము చేయనెంచు
సత్సంగమునే సంచరించు
సరదా జోకుల వర్జించు
భావము మంచివి రాణించు
భోగభాగ్యముల త్యజించు
భావి భారతము నిర్మించు
బంగరు బాటల కల్పించు

## 17. ఏడి శివుడు?

కానరాడాయె
కానరాడాయె
ఎంతెంతో వెతికినా
కానరాడాయె
ఇలలోన నా శివుడు
కానరాడాయె
కలలోన నా రేడు
రానేరాడాయె ॥కాన॥

కొండల్లో వెతికినా
లేడాయె శివుడు
కోనల్లో చూచినా
కానరాడె భవుడు
ముక్కంటి నా వేల్పు
మొర వినడాయె
ఒక్కంటి తోనైన
చూడడేమాయ ॥కాన॥

వెన్నెల నా స్వామి
ఎక్కడా లేడాయె
ఎందెందు వెతికినా
కానరాడాయె





హిమగిరియందు
గిరి శిఖరమందు
భువనాల ఏలేటి
శివుడు లేడాయె ॥కాన॥

జగముల ఏలేటి
జంగమురేడు
గణగణ మ్రోగెను
గంటలు గుడిలో
హరహరయని వేద
మారుడు రాడాయె
కరుణతో ననుగావ
శివుడు రాడాయె ॥కాన॥

## 18. చిన్ని కృష్ణా

చిన్ని కృష్ణా, మెల్లమెల్లరారా
నందగోపాలా, గోపాలా ఓ బాలా

వేణువును ఊదా, వెన్నలను తినా
వేగమేరావేరా, వేణు గోపాలా

ఈలను వేసి, అందములు ఒలుక
ముదమున రావేరా, మోహన గోపాలా

నీలమేఘకాయ, గోపాలుల తోడ
ఘల్లుఘల్లున రావేరా, ఉల్లము ఉప్పొంగ

కన్నెలను చూడ కన్నయ్యరారా
కరుణవెలయంగ కావగ రావేరా





## 19. ఆనందం

ఆనందం ఆనందం
రామనామమే ఆనందం
రంగని భజన ఆనందం
రాగం తాళం ఆనందం ॥ఆనందం॥

దేవుని ధ్యానం ఆనందం
దీనుల సేవయే ఆనందం
దేశ సేవయే ఆనందం
త్యాగ నిరతియే ఆనందం ॥ఆనందం॥

సంతుల సంగతి ఆనందం
స్వార్థం వదులుట ఆనందం
ప్రజా సేవయే పరమానందం
పరోపకారమే మహదానందం ॥ఆనందం॥

ప్రకృతి దృశ్యము ఆనందం
పండిత గోష్ఠి మహాదానందం
పతితుల గొలుచుట ఆనందం
పరమాత్మ చేరుట ఆనందం ॥ఆనందం॥

# శక్తి కవితలు



## 1. సహకారం

సహకారమునెంచి
సాగిపోవాలి
సమన్వయమెంతో
సాధించి తీరాలి
సమతల, మమతల
సంఘముండాలన్న
సంఘములోనున్న
కుళ్లూడ్చాలన్న
సహకార బాటలోనే
సంచరించాలి
సహకారపుదోట
పెంచనెంచాలి ॥సహ॥

సమాన ప్రమాణ
సమాజముండాలన్న
హెచ్చుతగ్గుల నెల్ల
త్రుంచి వేయాలన్న
సహకార మార్గంలో
కలిసి నడవాలి
సహకార నావలో
పయనించాలి
సామ్యవాద నినాదాలు
నిజము గావాలి ॥సహ॥

ఇజాల నిజాలను
తేల్చివేయాలన్న
సహకార సంఘాల
స్థాపించు కోవాలి
సహకార సంఘాలను
ఉద్ధరించాలి
ధరలను, దోపిడీలను
గూల్చివేయాలన్న
సరుకుల పంపిణి
సరిగ జేయాలన్న
సహకార సంఘాల
పెంచుకోవాలి
సహకార ఉత్సవాలు
పొంగిపోవాలి ॥సహ॥

బీదలు సాదలు
బాగుపడాలన్న
పేదరికంబును
పారద్రోలాలన్న
సహకార తరువులు
పెంచుకోవాలి
తియ్యని ఫలములు
అందుకోవాల ॥సహ॥





## 2. నీమది నెంచు

భారతీయుడనని
నీమదినెంచు
భారత వీరుడని
నీమది నెంచు
త్యాగభూమియని
నీ హృదినుంచు
భోగము తగదని
మనసున నెంచు
యోగుల జోగుల
గతం పఠించు
పవిత్ర పథముల
రథము నడిపించు
వక్రరథ్యముల
శత్రువుల త్రుంచు
సోదర భావం
నీయెద నించు
ప్రేమానురాగం
పరుల ఎడయందుంచు
దీనుల యెడల
దయగావించు
మంచిని నీలో వెలిగించు
భారత దేశమును
పవిత్రముగా నెంచు
భారత జాతి
కీర్తి గడించు

## 3. నిజం చెబుతా

నిజం చెబుతా
ముమ్మాటికి
నిజం చెబుతా
నింగి విరిగి మీదపడ్డా
నిజం చెబుతా
దర్జాగా ధ్వజం లేప్తా ॥నిజం॥

నిజాయితి లేనివాళ్ల
కథలు చెబుతా
ప్రజలకు చాటిచెబుతా
విపంచి మీటి చెబుతా
గద్దెల పై కూర్చున్న
పెద్దల పుటలు విప్పుతా
పటముల త్రిప్పి సూప్తా ॥నిజం॥

అన్యాయం కండలున్న
అన్నల ఆరిపోస్తా
అలజడి లేవదీస్తా
దుష్టుల కల్మషాలను
బయటికి వేస్తా
బజారుకు లాగివేస్తా ॥నిజం॥

గోముఖ వ్యాఘ్రూల
గుట్టు విప్పుతా
పలువురిలో పరువు దీస్తా
దరిద్రుల దుఃఖాలను
దునిమివేస్తా
కడగండ్లను కడిగివేస్తా ॥నిజం॥





## 4. స్వార్థం

స్వార్థం సంచరించె
స్వార్థం నడయాడె
అంగనల చెంగుబూని
హంగులతో నాట్యమాడె ॥స్వార్థం॥

సందుల్లో పసందుగా
విందులకై చిందులాడె
చదువులకై పదవులకై
పెగ్గులకై సిగ్గు విడిచె ॥స్వార్థం॥

అమాయకులను మాయజేసి
అరమరికలు లేక తిరిగె
దొరలతో దోస్తీ చేసి
ధరలను పెంచివేసె ॥స్వార్థం॥

అందరిలో స్వార్థం
అడుగడుగున సంచరించె
పదవులకై విధవలకై
వెధవలతో విహరించె ॥స్వార్థం॥

అంగట్లో స్వార్థం పందిట్లో స్వార్థం
క్లబ్బుల్లో స్వార్థం మబ్బుల్లో స్వార్థం
నిషాలతో స్వార్థం మిశాలతో స్వార్థం
వేషాలతో స్వార్థం మోసాలతో పైకొచ్చె ॥స్వార్థం॥

## 5. వీడని అనుబంధం

అది మహానగరం
మన భాగ్యనగరం
భాగ్యాలకు నిలయం
తెలుగు వారికి వరం
ఉదాత్తమైన భవనాలు
మనోహర మంజుల వనాలు
మలయ మారుత పవనాలు
విశాలమైన వీధులు
సువిశాలమైన రోడ్లు
జిగేలుమనే లైట్లు
పగలని తోచే నైట్లు
రకరకాల సదనాలు
వింత వింత వదనాలు
నగరానికి పశ్చిమ దిగంతం
ఆఫీస్ నగర ప్రాంతం
వెలసెనొక సుందరనందనవనం
వనంలోన ఒక భవనం
భవనం శోభాయమానం
వనం సుమాలమయం
ముచ్చట గొలిపే గులాబీలు





మురిపించె వనంతో
అది 17 శరత్తుల క్రితం
తలుచుకుంటే అధోగతం
అంతా నవయువకులు
వనంలో తలపులు తెలుసు
తియ్యని తేనె పలుకులు
చకచకనడిచే నడకలు
పరుగులు తీసే అశ్వాలు
విరిసే పువ్వుల పరిమళాలు
సహకార శిక్షణ యువకులు
అయినారు నవాబులు
పలు ప్రాంతాల నుండి
పర గ్రామాల నుండి
సహకార శిక్షణకు
విచ్చేసినారు యువకులు
శిక్షణ గొలిపే విజ్ఞులు
లక్షణమైన రసజ్ఞులు
గురువులు గణనీయులు
గణనీయులు, గమనీయులు
కామేశ్వర రావు అనువారు
గురుగణములో పైవారు

వెలలేని ఆణిముత్యం
వెలుగొందె జ్ఞానసత్యం
ఆవహించె నదీ ప్రవాహం
వారి ప్రబోధాల విశేషం
సరళమైన రసశైలీ
ధారాళమైన రవళీ
అలవోకగా అందించే
అజ్ఞాన తిమిరం తొలగించే
కంఠం కంచు వలె మ్రోగినట్లు
గంటం నడయాడినట్లు
నిష్ణాతుడైన వాడు
వర్ధిష్ణువైన వాడు
అతని ప్రౌఢ ప్రతిభలు
భాసిల్లె నేటి వరకు
విలసిల్లె ఈనాటి వరకు
అలనాడు మాకు గురువు
ఈనాడు సహకార తరువు
అలనాడు మాకు శిక్షకుడు
ఈనాడు మాకు రక్షకుడు
సంతసించె మానసములే
వికసించె నిబిడసుమాలే





కాని అనుకున్న ఈ సత్యం
కాలేదు ఇల సత్యం
కనుకున్న కలలెల్ల
కల్లలుగా తోచె ఇల
చేరువుగా ఉన్న అధికారి
చెంతగా వున్న సహకారి
మమతలు పెంచినవాడు
నవతలు నేర్పినవాడు
సహకార రంగమున
సోపానాలను నిల్పి
సహకార సంఘాలను
సంస్కరించిన ఘనుడు
ఇంతటి అధికారి
వీడిపోవుటే వ్యథ
ఇంతటి సహకారి
వదలిపోవుటే బాధ
వీడుకోలు సల్పుచూ
వెతల దీర్చ వేడెదను
సంపదలను సంతరించ
శివకేశవుల వినుతి జేతు

## 6. బ్రతుకుబాట

నేను నడుస్తున్నా
రోడ్డు నడుస్తున్నా
బాట నడుస్తున్నా
బతుకు బాట నడుస్తున్నా
మాటలిడుస్తున్నా
మూట గడిస్తున్నా ॥నేను॥

రోడ్డు పొడవు ఎంతో
రోజులనడక ఎంతో
గమ్యం అసలు తెలియదు
గమనం ఏమిటో తెలియదు
మజిలి ఎక్కడుందో
బిజిలి ఎక్కడుందో
అయినా నడుస్తున్నా
రోజులు గడుస్తున్నా ॥నేను॥

అడుగులు వేస్తున్నా
తప్పటడుగులు వేస్తున్నా
క్రిందపడి పోతున్నా
లేసి నడుస్తునే ఉన్నా
ఎక్కడో నడుస్తున్నా





ఏమో గడిస్తున్నా
బరువులు పెంచుకుంటా
అరువులు పెంచుకుంటా
కరువుతో నడుస్తున్నా
ఇరుకుతో నడుస్తున్నా
ఇరులతో నడుస్తున్నా
విరులతో నడుస్తున్నా ॥నేను॥

రోడ్డు బాగులేదు
రోషం విడువను లేదు
గోతులు ఎన్నో వున్నా
ఘాటు వేస్తలేరు
నీతులు చెపుతూనే వున్నా
ఖాతరు లేశం చెయ్యక
గమ్యం ఏదో తెలియక
తాపం పెరుగుతూ వున్నా
పాపం పెంచుతూ వున్నా
అహం నించుతూ వున్నా
దాహం పెంచుతూ వున్నా
రోజులు గడుస్తున్నా ॥నేను॥

ఆలుబిడ్డలంటూ
అయినా అడ్డాలంటూ
కాలం గడుపుతూ వున్నా
కావ్యం నడుపుతూ ఉన్నా
కార్యం చేస్తూనే ఉన్నా
శౌర్యం నాదంటున్నా
ఈ వనం నాదంటున్నా
యౌవనం నాదంటున్నా
క్రౌర్యం అణచుకుంటూ
ధైర్యం నింపుకుంటూ
[illegible]కుస్తున్నా ॥నేను॥

దరికి నడుస్తున్నా
వింతలు ఎన్నో ఎన్నో
సొంతం నావనుకున్న
ఛుక్కలు లెక్కలు చేసి
దిక్కులు నింపుకున్న
భవనాలెన్నో కొన్న
భాగ్యాల నేనే మిన్న
వనాలు విరుస్తున్నా
నేను మురుస్తున్నా
రోజులు గడుస్తున్నా ॥నేను॥





పచ్చని వసంతశోభ
పలాయనం చిత్తగించె
విరజాజి మల్లెలన్న
విడివిడి వాడిపోయె
బ్రతుకులో మోడులన్నీ
మోడులు వారిపోయె
కోకిల గానాలన్నీ
కాకుల గోలలాయె
వింతై పోయిందంతా
సంతై పోయిందంతా
కాళ్ళు తడబడుతున్నా
కర్రను ఊతగొన్నా
ఐనా నడుస్తున్నా ॥నేను

## 7. ఇరవై సూత్రాల పథకం

కదిలింది కదిలింది
మహారథం కదిలింది
మహారథం కదిలింది
దివ్యరథం కదిలింది
దీనజనుల మనోరథం
బలహీనుల మనోరథం
నెరవేరక ఈడేరగ
నవ్యరథం కదిలింది
భవ్యరథం పట్టింది ॥కది॥

ఇరువది అశ్వాల రథం
ఇరువై అంశాల రథం
ఎన్నో కుటుంబాలను
బాగుపరచనడిచింది
ప్రగతి పథం పట్టింది
అలసత్వం నెట్టింది
ముందుముందు దృక్కులతో
దిక్కులను వెలిగించగా
అరుణారుణ కిరణాలతో
క్రాంతులను కలిగించగా
భ్రాంతులను తొలగించగా
ఇండియా ధర యందు





ఇందిరా ఆధ్వర్యమందు
ఇపుడిపుడే కదిలింది
ఈ పూటనే కదిలింది
ప్రజా రథం కదిలింది
నిజపథం నడిచింది

అధఃపాతాళమున
అణగారిన అన్నలారా
ఆకలిమంటలచే
అలమటించే అక్కలారా
దీనులారా, హీనులారా
దిక్కులేని తమ్ములారా
లేవండి చూడండి
లేచి ముందు నడవండి
నవ్యమైన రథం వచ్చె
భవ్యమైన పథం వచ్చె
పేదవారి పెన్నిధియై
బీదవారి బాగుపరచ
మీ చెంతకు చేరవచ్చె
మీ పొంతకు రానేవచ్చె
మొక్కండి మొక్కండి
దిక్కింక ఇదేనండి
నిక్కమైన రథం ఇదే
చక్కనైన పథం ఇదే ॥కది॥

## 8. హరిజనుల గురించి

చెప్పాలని వుంది
నాకు చెప్పాలని వుంది
దీనజనుల బాధల గురించి
వారి వదనాల గురించి
వారి సదనాల గురించి
చితికిన దేహాల గురించి
బతుకుల భారాల గురించి
చినిగిన గుడ్డల గురించి
మాడిన తలల గురించి
మోసిన కష్టాల గురించి
నికృష్టపు జీవితాల గురించి ॥చెప్పా॥

అలుముకున్న చీకట్ల గురించి
అంటరాని తనాన్ని గురించి
జరిగిన అత్యాచారాల గురించి
మాసిన హృదయాల గురించి
వెట్టి చాకిరి గురించి
ఒట్టి గాసాల గురించి
చెయ్యని నేరాల గురించి
జరిగిన ఘోరాల గురించి
మోసిన భారాల గురించి
అమాయక జీవుల గురించి





వారి వినయ భావాల గురించి
మంచి మనుష్యుల గురించి
మంచి మనసుల గురించి ॥చెప్పా॥

మారుతున్న కాలాల గురించి
మంచి వారాల గురించి
మారుతున్న హరిజనుల గురించి
హరిజనుల బాగోగుల గురించి
ఆరాటపడుతున్న హృదయాల గురించి
ప్రభుత్వ పథకాల గురించి
సంక్షేమ కార్యక్రమాల గురించి
ఇరవై సూత్రాల గురించి
ఇందిరమ్మ సుకర స్కీముల గురించి
కార్పోరేషన్‌ల స్థాపన గురించి
కలిమి కల్గించాలన్న కోరిక గురించి
మహనీయుల మాటల గురించి
అమాత్యుల ఆలోచనల గురించి
అధికారుల అవిరళ కృషి గురించి
జరుగుతున్న ప్రగతి గురించి
బాపుకన్న కలల గురించి
బాగుపడుచున్న రోజుల గురించి ॥చెప్పా॥

# 9. సహకార పతాకం

చేయిచేయి కలపాలి
చేయూతగ నడవాలి
భుజం భుజం కలపాలి
ధ్వజం ఎత్తి సాగాలి
సహకారపు మమకారపు
బావుటాను చేతబూని
చైతన్యపు బాటలోన
బయలుదేరి నడువాలి
బాగుపడే మనమంతా
బావుటాను చేతబూని
నడువాలి నడువాలి
నడుంకట్టి నడువాలి ॥చేయి॥

అసమానత తొలగించగా
మానవతను వెలిగించగా
సమతలను మమతలను
సంఘంలో కలిగించగా
సహకారపు సదాచార
పతాకమును ఎగిరించియు
పథకములను చేతబూని
ముందుముందు నడవాలి
నడిచి మజిలి చేరాలి ॥చేయి॥





ఒకరికొకరు ఒకరినొకరు
ఒండొరులు ఏకమై
అందరికి అండనిల్చి
అనురాగం అలరారగా
సంపదలను సంతరించగ
స్వార్థములను ఉత్తరించి
సహకార పతాకమును
చేయూతగ చేతబూని
నడువాలి నడువాలి
నడుంకట్టి నడువాలి
కదంత్రొక్కి నడువాలి
కలలు నిజము చేయాలి ॥చేయి॥

## 10. ఎన్.జి.ఓ. నాయకుడు

అతడు నాయకుడు
ఎన్.జి.ఓ. నాయకుడు
బీదజనుల సహాయకుడు
ఉద్యోగుల ప్రయోజకుడు
నైరాశ్యం ప్రబలిపోయె అలనాడు
అంధకారం అలుముకొనె తెలుగునాడు
నాయకుల హృదయాలు నిండె నిరీహం
నాయకుడు కరువాయె విధి బలీయం
తెలంగాణా ఎన్.జి.ఓ.లకు ఆనాడు
తెరువు కనరాని తరుణాన
చీకట్లను చీల్చి చంద్రునిలా
విఘ్నాలను పారద్రోలె ఇనుడిలా
సారథ్యం చేతబూనె కృష్ణుడిలా
పథకం నడిపించబూనె రాముడిలా
రామకృష్ణుడరుదెంచె ఆ తరుణాన
తెలుగునాడు తొలకరి సూర్యకిరణంలా
అణగారిన ఆశలు పైకేతెంచె
ఆరిపోయిన దివ్వెలన్ని వెలుగొందె
ఉద్యోగుల బాగోగుల గమనించె
ఉదాత్తమైన మార్గాల నడిపించె
అభివృద్ధి లేక తిరిగె అందరిలో





అరమరికలు లేక తిరిగె అందరిలో
సమస్యల సాల్వుచేయక సమకట్టె
సర్కారుకు వినతి చేసె
కార్యసిద్ధి గావించె
కార్యశూరుడనిపించె
ప్రాతినిధ్యత వహించె
పరపీడల తొలగించె
ప్రగతి పథం నడిపించె
జగతికి చాటించె
తెలుగు వారము మేము
తెలంగాణా మా వీణ
ఆంధ్రదేశము మాది
ఆంధ్రులము మేము
సరసుడు, శాంతమూర్తి
సహకారి, మమకారి
సోదరుడు, సహోదరుడు
సౌజన్యం ఉన్నవాడు
పాలమూరుకరుదెంచె
పాలమూరి నివాసి ఇతడు
అలంపూరు ప్రాంతాన
ఆవిర్భవించిన పూవు
పలుప్రాంతాలయందు

పరిమళించి గుభాళించె
తావులను వెదజల్లె
విరితావుల క్రుమ్మరించె
పరుల సేవల నెంచి
పరమాత్ముడు కరుణించె
ప్రమోషన్‌ల ఇచ్చిమెచ్చి
ప్రియతముడని చాటె
పుణ్యదంపతులకు నేను
అభినందనల గావింతు
వందన సుమాలనింతు
మందారముల ముంతు





## 11. విన్నారా

విన్నారా, ఇది
మీరు విన్నారా
వీనులకు విలువైన
వార్త విన్నారా ॥విన్నారా॥

సహకార భవనంలో
సభ ఏదో జరుగునంట
సహకార అధికారులు
సమావేశమయ్యారంట ॥విన్నారా॥

సమాచారమేమంటే
సహకారి అధికారి
సహృదయం గలవాడు
సౌమ్యం గలవాడు
ఆకాశ వీధిలోన
అరుణకిరణంవోలె
అరుణాచలరావంట
అందరికి అభిమానియంట
అందాల తారనంట
ఆభరణం మింటనంట
ఆనందం ఇచ్చెనంట
అందరికి నచ్చెనంట ॥విన్నారా॥

ఆరు వసంతాలు గడిసె
అనుబంధం విడిదిసేసె

మమతలను పంచి ఇచ్చె
మమకారం నించి ఇచ్చె
మహబూబ్‌నగరంలో
మన్ననల పొందెలెస్స
మందహాస సుమాలెన్నో
మల్లియలై విరబూసె ॥విన్నారా॥

వియోగం మాట ఏదో
వినిపించె నేడొకటి
వీనులకు వింతతోచె
విపరీతముగా తోచె
మనసెంతో బరువాయె
మానసమె ఇతరమాయె
మౌనము సహించడాయె
మరి ఎంతో నికృష్టమాయె
సభా సదులకెల్లరకు
సంతోషం కరువాయె ॥విన్నారా॥

సింహాచల ప్రభువును
శ్రీశైల మల్లన్నను
అరుణాచల క్షేమాలను
అందరూ వేడుకొనిరి
మొహియొద్దీన్ మాన్యులకు
సుస్వాగతం పల్కిరంత
సభికుల స్వగతముతో
సమావేశము ముగిసెనంత ॥విన్నారా॥





## 12. మతాలన్నీ ఒకటే

పథాలు వేరు కాదు
మతాలు వేరే కాదు
మమతలున్న చాలు
మతాలన్నీ ఒకటే
మనసుల కలిపిచూడ
మనుష్యులంతా ఒకటే
మనీషిగా కావలెనని
మహనీయులెల్లనుడివిరి
మతాల లోతుజూడ
మర్మం ఒకటే తేలు
కర్మలనెపుడు చేయి
ధర్మం దారి విడువకు
సత్యం వద అన్న
సందేశం ఇచ్చిరంతా
మహ్మద్ ప్రవక్త చూపిన
మానవత దారి ఒకటే
కరుణామయుడు క్రీస్తు
కురిపించె కృపారసము
అమరగానముల పాడిన
ఆత్మసందేశమొక్కటే

భగవద్గీతలోని
భావము తెలికితీయు
భోగము తగదునీకు
యోగముల చెప్పలెస్స
అన్ని మతాల ధర్మం
సందేశ మొక్కటే
రామ్‌రహీం అన్న
కృష్ణ కరీం అన్న
కరుణించె ప్రభువైన
కాపాడే విభుడు అతడె
ప్రేమానురాగాల
ప్రభుపైన పెంచు నిరతం
కరుణారస భావాలను
కణకణములో నించు నిత్యం





## 13. రైతన్నా

మరువకు మరవకు రైతన్నా
మార్గము ఒకటే కలదన్నా
సహకార సంఘమే మేలన్నా
సమతల మమతల పెంచన్నా ॥మరు॥
దీనవదనము ఏలన్నా
ధైర్యము వీడక నడువన్నా
సహకార సంఘమే నాదంటూ
స్థైర్యము నీలో పెంచన్నా ॥మరు॥
సావుకారికి దూరముగా
సరుకారుకి చేరువుగా
సమయం వృథా చేయగ
సాయము పొంది ఎదుగన్నా ॥మరు॥
సోకులు టక్కు వద్దన్నా
సరదా ఖర్చులు ఏలన్నా
సొంత ద్రవ్యము కొంతంటూ
సంపద పెంచవలెనన్నా ॥మరు॥
పేదలు బాగుపడాలన్నా
పేదరికం పోవాలన్నా
సంఘంలోన చేరన్నా
సహకారమునే నీవు ఎంచన్నా ॥మరు॥
దేశమంటేనే నీవన్నా
నీవు బాగుంటే మేలన్నా
రైతు సోదరులే బాగైతే
రాజ్యమే స్వర్గమవునన్నా ॥మరు॥

## 14. నువ్వు - నేను

నువ్వు ఎవరు?
నేనెవరు?
నువ్వంటే నేను
నేనంటే నువ్వు
నువ్వు ఎవరో తెల్సుకున్నా
మరి నేనెవరో నాకు తెల్సింది
నీకు నాకు లేదు భేదం
నాకు ఇంకా లేదు ఖేదం
నువ్వే నేను
నేనే నువ్వు
నువ్వంటే నువ్వే
అనుకున్నా
నేనంటే నేనే
అనుకున్నా
కాని నేనులో
నువ్వున్నావని తెలియదు
నువ్వులో నేనున్నానని
అసలు తెలియదు
నేను నేనే కానే కాదు
నువ్వు నువ్వే కానే కాదు
నువులేనిది నేను లేనేలేను





నేను లేకుంటే నీవు లేనేలేవు
నువున్నావని నేనున్నా
నేను వుండడానికి
నేనుకు ఆధారం
నీవు నీవే నాకాధరం
నువ్వెక్కడున్నా
అనంత దూరం ఒకటే
అయితే, ఇంకా నేను
లేనే లేను
అంతా నువ్వే నువ్వు
అనంతం నువ్వు
ఆది అంత్యం నువ్వు

## 15. నాకేమి తెలుసు

నాకేమి తెలుసు
నాకేమి తెలుసు
నీవున్న జాడ
నాకేమి తెలుసు ॥నాకేమి॥
నీ ప్రేమ పొంగు
నీ తలపు మెరుపు
నా తలపులోనని
నాకేమి తెలుసు ॥నాకేమి॥
నాలోన నీవు
నవ్వుతుంటావని
నాలోనే నీవు
దాగుంటావని ॥నాకేమి॥
వెన్నెల వెలుగై
నీవున్నావని
నాలోని వెలుగై
నీవున్న తీరు ॥నాకేమి॥
నీ కాంతి కిరణం
నీ కంఠ భరణం
నాపైన కరుణ
కలుగున్నావని ॥నాకేమి॥
మెల్లన అల్లన
వస్తుంటావని
చల్లని చేతులను
చాచుంటావని ॥నాకేమి॥





## 16. నా దేశం మిన్నా

అవనిలోనె అన్నా
నాదేశం మిన్నా
నాదేశం మిన్నా
ఏ దేశం కన్నా ॥అవని॥
భరత భూమి వంటి
పుణ్యభూమి లేదురా
భువిలోనే లేదురా
ఇలలోనే లేదురా ॥అవని॥
హిమగిరి పర్వతాలు
కైలాస శిఖరాలు
సజీవ సోయగాలు
నా తల్లి కిరీటాలు ॥అవని॥
శ్రీరాముని జన్మభూమి
శ్రీకృష్ణుని కన్నధాత్రి
బుద్ధుడు పుట్టిన దేశం
తలుచుకుంటే ఆవేశం ॥అవని॥
అశోక చక్రవర్తి
మౌర్యుల ఘనకీర్తి
శివాజి శూరత్వం
రాణాప్రతాపు వీరత్వం ॥అవని॥
వీరపాండ్య కట్టబ్రహ్మన
వీరగాథలెన్నో
సీతారామరాజులాంటి
సింహ కిశోరులెందరో ॥అవని॥

గాంధీ, జవహరులు
నేతాజి, భగత్‌సింగ్
స్వాతంత్ర్య సమరాన
పోరాడిన త్యాగధనులు ॥అవని॥
త్యాగయ్య, క్షేత్రయ్య
రామదాసు, కబీరుదాసు
ఎందరో మహానుభావుల
కన్నట్టి నా దేశం ॥అవని॥
చైతన్యుని కృష్ణభక్తి
వెల్లువలై పారింది
వివేకానంద రవితేజం
విశ్వంలో భాసిల్లింది ॥అవని॥
ఝాన్సీలక్ష్మీబాయి
ఝుళిపించే తన ఖడ్గం
రుద్రమాంబ రౌద్రంతో
వణికించే శత్రుజనం ॥అవని॥
సీతాసావిత్రుల కన్నట్టి
భారతి నా దేశం
పతిభక్తి దైవభక్తి
కరువులేని నా దేశం ॥అవని॥
అన్నలారా తమ్ములారా
భావి పౌరులారా
ఈ దేశం విలువలను
కాపాడుట మీ ధర్మం ॥అవని॥





# 17. కార్యదర్శి

కార్యదర్శి లేవరా
కార్యదీక్ష బూనరా
కంకణధారివయ్యి
కర్తవ్యం చాటరా
కదం తొక్కి నడవరా
కలతలను దీర్చరా
సభ్యులను చేరదీసి
సాహిత్యం పెంచరా
రంగమున దూకరా
సంఘవృద్ధి చేయరా
రంగరంగ వైభవముగా
సంఘవృద్ధి చేయరా
సహకారం పెంచరా
మమకారం నింపరా
మమతలనే మాలికలతో
మనసులను కలుపరా
నాదినాది అనకురా
నాది అనుట తగ్గరా
అందరి అభివృద్ధిలోనె
ఆనందం పొందరా
స్వంత కుటుంబం ఓలె
సంఘములను చూడరా
సభ్యులను చెంత చేర్చి
సఖ్యతను పెంచరా

## 18. మనసా ఓ మనసా

మనసా ఓ మనసా
మాయలాడి ఓ మనసా
మాయలాడి ఓ మనసా
మోసకారి ఓ మనసా ॥మనసా॥

మంచి మంచి మాటలతో
మరి మరి చెప్పాను
చెప్పిన మాటలెల్ల
చెవి యొగ్గి వింటావు
చెప్పినట్టు తూచాగా
చేస్తానంటావు నీవు
చేస్తానంటావు గాని
చేజిక్కకుంటావు ॥మనసా॥

చంచలం వలదని
చేరదీసి చెప్పాను
చేయి పట్టుకున్నాను
చెరుగు వీడకున్నాను
చెంతనే ఉన్నట్టు చేసి
చటుక్కున వెళ్తావు ॥మనసా॥





మాయలో పడకని
మళ్ళీ మళ్ళీ చెప్పాను
మోసాలు, ద్వేషాలు
మనకెందుకన్నాను
మంచిమంచి భావాలు
పెంచమని చెప్పాను
అట్లేనంటావు గాని
అదే దారి వెళ్తావు ॥మనసా॥

కోరికలు వలదని
కోరి కోరి చెప్పాను
కోపాలు తాపాలు
కొంత తగ్గమన్నాను
ఆశలో పడకని
పదే పదే చెప్పాను
కలతలు చెంద నీవు
కరుణ జూపమన్నావు
తరుణం చూసి నీవు
తట్టుకుని జారతావు ॥మనసా॥

ముక్కుసూటిక నిన్ను
నడువమన్నాను
సత్యం దారి వీడక
నిత్యం నడువమన్నాను

ధర్మం వీడకని
దండించి చెప్పినగాని
ఖండించి వెళ్తావు ॥మనసా॥

రామనామ జపము
సాగించమని చెప్పాను
నామం స్మరణ చేస్తే
నయమవుతాయన్నాను
అట్లే చేస్తానంటావు
అయోమయంలో చేస్తావు ॥మనసా॥

ఏమి సేతునేను
ఏమని చెప్పుకొందును
నీ తీరు బాగులేదు
నీ దారి బాగులేదు
నిన్ను నిలుపాలంటే
నాతరం కాకుంది
నీ వేషాలేమందును
నీ మోసాలేమందును ॥మనసా॥





## 19. చెప్పమంటారా

చెప్పమంటారా . . .
వీడ్కోలు చెప్పమంటారా
గులాంగౌసుగారి
గుణగణగరిష్ఠునికి
వీడ్కోలు చెప్పమంటారా
ఘనంగా చెప్పమంటారా
పణంగా చెప్పమంటారా
మనసు మూగవోయినా
హృదయం వీణ పలకకున్నా
మౌనంగా భారంగానైనా
చెప్పమంటారా
వీడ్కోలు చెప్పమంటారా
ఈ రోజు గళం విప్పమంటారా
సరసుడైన సహకార అధికారి
మమతల మాలికలల్లిన
మహనీయుని గూర్చి చెప్పమంటారా
వియోగం సహించమంటారా
కలంపట్టి కరమున
కంకణం గట్టి కార్యదీక్షతో
కార్యములు చేసి
కార్యము నడిపిన

విషయాలు చెప్పమంటారా
వియోగ విషమును మింగమంటారా
వీడ్కోలు చెప్పమంటారా
సహకార రంగమున
సంఘముల చక్కబరిచి
సమస్య సరిచేసి
సమన్వయంబు
సాధించిన తీరు
సాధించిన విజయాల గూర్చి
చెప్పమంటారా
వీడ్కోలు చెప్పమంటారా
ఈ రోజు పెదాలు విప్పమంటారా
మల్లెలు  కొల్లలుగా రాలిన వేళ
మందారములు
మందహాస దరహాసముల
చిలికిన వేళ
వత్సరం వసంతముగా గడిచిన వేళ
గౌసు ఘనములు
సాధించిన తీరు
చెప్పమంటారా
వీడ్కోలు చెప్పమంటారా
వియోగం
భరించమంటారా





## 20. ఆలోచనలు

ఆలోచనలు పెంచు
ఆలోచనల నించు
మనసులో ఆలోచనలు
మస్తిష్కంలో వుంచు
ఆలోచనల తీరు నీవు ఆలోచించు
ఆలోచనల గతి ఆపి నిరోధించు
అదుపులో వుంచు ఆలోచనల పెంచు
ఉదాత్త భావాల ఉదారము గణించు
ఉన్నత శిఖరాల అధిరోహించు
అధమ భావాల అధిగమించు ॥ఆలో॥
దుష్ట భావాల దూరముగ తరుము
దురాలోచనల మొదలుగ త్రుంచు
కాముక భావాల కత్తిరించెయ్యి
పవిత్ర భావాల పదిలముగ పెంచు
అజ్ఞాన ఇరులను పరంగ పంపు
ఆలోచనలను పెంచు ఆనందం నించు ॥ఆలో॥
ఆలోచనల పెంచు
అమృతము నించు
జ్ఞానమును పెంచు
ఎదిగి రాణించు
భావముల లోనే

బ్రతుకులు పండు
భావాలు బాగుంటే
భవితవ్యముండు
హృదయములోనే
ఉదయించు సూర్యుడు
ఎనలేని తలపులే
వెలలేని సంపదలు
బంగారు భావాలే
రంగుల హరివిల్లు
బ్రతుకును తీర్చుటకు
భావాలే వెలుగు
వెలుగును చింతించి
వెన్నెలను నింపు
పరుల హితంకోరి
ప్రేమలను పెంచు
దివ్వెల వెలిగించి
దైవమును గొలుపు
ప్రేమల వెలిగించి
కామం వదిలించు
ఆలోచనల పెంచు
అమృతం నించు ॥ఆలో॥





## 21. వీడ్కోలు

వీడ్కోలు నీకు
శ్రీధరా సోదరా
చెప్పలేనయా
మనసొప్పబోదయా ॥వీడ్కోలు॥

పెదవులు విప్పలేను
పదములు పాడలేను
మౌనంగా వీడ్కోలు
చెప్పలేనయా ॥వీడ్కోలు॥

అరుదెంచినావు నీవు
మా ప్రాంగణమున
అనురాగ సుమాల
అలరించినావు ॥వీడ్కోలు॥

మమతల మల్లెలు
కొల్లలుగా వెదజల్లి
మమతానురాగాల
పండించినావు ॥వీడ్కోలు॥

అరవిందుని యొక్క
అభిమానముల పొంది
అరుణోదయమయ్యి
ప్రభవించినావు ॥వీడ్కోలు॥

డి.ఆర్.డి.ఏ.లో
దీనులకు తోడయ్యి
దివ్వెల వెలిగించి
భాసిల్లినావు ॥వీడ్కోలు॥

నిరతం నీ కృషి
నే చెప్పలేను
నీ శ్రద్ధపుటలను
నే విప్పలేను ॥వీడ్కోలు॥

జోహారు జోహారు
శ్రీధరా సోదరా
మణిహారముల వేతు
జయములు కలుగగా ॥వీడ్కోలు॥

నీ మందహాసం
వెన్నెల కురిపించు
నీ దరహాసం
లలిత భాష్యం భాషించు ॥వీడ్కోలు॥





## 22. డి.ఆర్.డి.ఏ.

లేవండోయి లేవండి
డి.ఆర్.డి.ఏ. వచ్చింది
మీ ముంగిటనే నిల్చింది
మీ ఇంటికే వచ్చింది
గ్రామీణ సంస్థ వచ్చిందంట
గ్రామీణులారా రారండి
బీదల్లారా రారండి ॥లేవండోయి॥

పేదల్లారా చూడండి
దిక్కులేని తమ్ములారా
బిక్కమొగం వేయకండి
అన్నలారా రండి
అక్కల్లారా లేవండి
పేదరికం బాపుటకై
పథకమొకటి వచ్చింది
దుఃఖాలను తుంచుటకై
కడగండ్లను కడుగుటకై
ఆర్థిక సహాయం ఇచ్చుటకై
అర్థముతోనే వచ్చింది ॥లేవండోయి॥

బ్యాంకుల చెంత నిల్చింది
బ్యాంకుల అప్పు పొందండి

వృత్తి పనులను చేపట్టి
వృద్ధి మీరు పొందండి
బావులనే త్రవ్వండి
భాగ్యాలనే పొందండి
బాగుపడి మీరంతా
బిరబిరా నడవండి
భవితవ్యం చూడండి
కర్తవ్యం పూనండి
సబ్సిడీలు పొందండి
సంపద సంతరించండి
బ్రతుకును బాగు చేసుకోండి
బంగారు బాటలు వేయండి
చీకట్లను చెండాడి
చైతన్యం తీసుకురండి ॥లేవండోయి॥



# రక్తి కవితలు

## 1. స్వరాజ్యం

స్వతంత్ర పీఠభూమి అదిగో
స్వరాజ్యంబు వెలసె యదిగో
కాలదన్ని కలతలన్ని
కలసిమెలసి ఉందమోయ్ ॥స్వతంత్ర॥

బాపులేదు మనకు నేడు
బాధ్యతేమో మనదేనోయ్
పుణ్యచరిత భరతమాత
భాగ్యవనిత గొలుతమోయ్ ॥స్వతంత్ర॥

హృదయమిచ్చి కదముత్రొక్కి
ముదముతోడ నడుతమోయ్
గంగ, తుంగ, రంగు భువిని
వంగి వందనం జేతమోయ్ ॥స్వతంత్ర॥

సహకరించి సంపదలను
సంతసమున పొందుమోయ్
సామ్యవాద సంఘమందు
సామాన్యముగా వుందమోయ్ ॥స్వతంత్ర॥





## 2. తెలుగోడా

జలజల పారేగంగా
వెలవెల ఎగిరే తిరంగా
అడుగేసి ముందుకు నడువోయ్
ఓరోరి తెలుగోడా!
నీ తల్లి భరతమాత
నిలిచింది సుజాతా
ఎలుగెత్తి జోహారెంచు
ఓరోరి తెలుగోడా!
కలిగింది స్వాతంత్ర్యం
ఇంకెందుకు పారతంత్రం
ఒలికించు నీదు శౌర్యం
ఓరోరి తెలుగోడా!
బంగారు భరతమాత
కన్నది కడుపునిండ
పండించు పసిడిపంట
ఓరోరి తెలుగోడా!
బలిదానం దేశంకోసం
విచ్ఛేదం వీరుల రక్తం
ప్రకటించు నీ ప్రతాపం
ఓరోరి తెలుగోడా!

## 3. విహారము

విద్యార్థుల విహారం
కదిలింది పరివారం
ఎల్లరోజులకెల్ల
విలువెంతో ఈ వారం
మదిలోని మనోరథాలు
పల్కియున్న పంథాలు
తీరునేమో నేటికన్ని
తేరునేమో సాటివన్ని
అంతరంగ మానందం
మందహాస ముఖబింబం
స్నేహ బృందం కంత
సంతోషం, సంతోషం
జంటై విహరించే
రోజులు ఇక ఏతెంచే
వెంటై పయనించే
మోజులు ఇక మురిపించే
కంఠం ఏకం జేసి
గీతం ఆలాపించే
రాగాలే పల్కించే
అనురాగాలే వొల్కించే





ఎన్నెన్నో ఊహలె
ఊర్విపై విహరించే
ఉల్లములే వెల్లువలై
ఉప్పొంగి ప్రవహించే
మైళ్ళ కొలది దూరమేమో
మరి మనసే పరుగించే
కన్ను తెరచి లేకున్నా
చూపులన్ని ప్రసరించే
దగ్గరలోనున్న
ధవళేశ్వర ఐశ్వర్యం
గోదావరి నీరెల్లా
గలగల ప్రవహించే
బంగారు రాముదున్న
భద్రాచల సుక్షేత్రం
సింగారంలతోడు
సిరులెల్ల ఒలికించె
రాజారాముల వారి
పూజలెన్నో సేయంగ
సీతారాముల వారి
కళ్యాణం జరుగంగ
కంచర్ల గోపన్న
కన్నులకు పొడగట్టె

తానీష నీడలలో
గుడిగోపురం గట్టె
అక్కన్న, మాదన్న
సోదరవర్గం జోడు
తిక్కన్న, సోమన్న
గంటం వ్రాసిన తీరు
చక్కని అక్షరాల
చరిత్రయె చదివినట్లు
నిక్కమైన విషయాల
నిజమెంతో తెల్పినట్లు
శిథిలమైన నగరాల
స్థితిగతుల నెర్గినట్లు
తెలియని ప్రాంతాల
భాషలన్ని నేర్చినట్లు
సకల శాస్త్రాల
పరిశోధన సల్పినట్లు
భక్తజనుల పాలిటి
రక్తిదాయ మయ్యినట్లు
విద్యార్థుల విహారం
కదిలింది పరివారం





# 4. దారిద్ర్యం

దారిద్ర్యం దాపురించే
ఈ దయా దాక్షిణ్యంలేని జగంబున
దారులు ఏవో కాన రావుగదా
దివసంబులు గడుపుకొను తెరువులా
పుట్టెడు అప్పులు నెత్తి పట్టె
కట్టెకు గంజికి కరువాయె
నిట్ట నిలువుగా గ్రుడ్లు తేలె
నెట్టుకొనివచ్చె పెద్దతుఫాను
చుట్టుముట్టునా ఎక్కడ నిలువ లేక
బ్రతుకులు భారమపారములు
మెతుకులకే వెరచియరచి
మోములు వాచి
చితికిన చిక్కిన దేహాల
మతి మయుల మృన్మయుల
మనుగడలేలా ?
మర్యాదలు లేని
మనోవేదనలే ఉన్న
ఈ దారిద్ర్యపు
మనుగడ లేలా !

## 5. శాంతి సాధన

పర్జన్యుని గర్జనారంభం
ప్రేరేపిత వర్షారంభం
పుడమిన పొడచిన వివాదం
కలుగక మానదు భేదం
నీరాటములకు వనాటములకు
పోరాటం కల్గిననాడు
కరిని కాపాడె
కరుణాపయోనిధి
కలియుగాన కలహాలెన్నో
కల్గినకాని
కమలనాభుడన్నిదిశల లేడందువా
అదరక బెదరక అడ్డగించు
ఆఖరుకైన నిజం, నిజం
భ్రాంతి యనక శాంతికై సాగిపోవాలి
విశ్రాంతి ఎందుకు నీకు అసాంతం
భేదాభిభేదాలు ఛేదించి తీరాలి
ప్రేమానురాగాలు పులకింప జేయాలి.





## 6. పరిశ్రమ

పరిశ్రమను చేయవోయ్
పౌరుషము చూపవోయ్
పల్కించే పలుకదోయి
పండిత నెహ్రూదోయి
నియమం రోజు వీడకా
నీచేత అంబర్ చరకా
నిత్యమునూలు తీయి
నియమంగ ఖాదివెయ్యి
ధాన్యాలకెల్ల శ్రేష్ఠం
దంపుడు బియ్యంకాదా
గడిబిడ ఎందుకోయి
గానుగనూనె లేదా
కర్షకులారా మీరు
కలతలు వీడండోయి
కామర్సు ఇండస్ట్రీస్
కలిగించు మీకు సౌఖ్యం
యం.ఎన్. రెడ్డి గారి
ఎడతెగని శ్రద్ధ వల్ల
ప్రోత్సాహం కల్గెనేడు
పరిశ్రమలు వృద్ధిచెందె.

## 7. గాంధి జన్మదినం

గాంధి పుట్టిన రోజు
ఈ రోజు
మాకు మిక్కిలి మోజు
ఈ రోజు
మాకు ఎంతో మోజు ॥గాంధి॥

గాంధి చెప్పిన నీతి వాక్యములు
మాకు మిక్కిలి ప్రీతి
సత్యాహింసలె, శాంతి ధర్మములె
పాటించుటే మా రీతి ॥గాంధి॥

పేదల పాలిటి పెన్నిధియయ్యి
గాంధి మహాత్ముడు నిలిచె
పేదరికంబును పారదోలుటకు
ప్రయత్నము నెంతో చేసే ॥గాంధి॥

గాంధీ కన్న స్వప్నములన్ని
సత్యములై ఇల నిలిచే
రామరాజ్యము వెలయాలన్న
రోజుల కొరకై వేచిచూసే ॥గాంధి॥

రామ రాజ్యము వెలయకముందె
రాముని దగ్గరకేగె
'రఘుపతి రాఘవ రాజరామ'ని
రాముని గానం చేసె ॥గాంధి॥

బాపులేని ఈ రోజులలోన
బాధ్యత మనపై వుంది
భారతజాతిని తీర్చిదిద్దుటే
భావి పౌరుల పై వుంది ॥గాంధి॥





## 8. బాపు భక్తులు

జరుపుకుంటున్నారు నేడు గాంధీ పుట్టిన పండుగ
వారే గాంధి భక్తులు, మనసార నిండుగ
గాంధి అంటే వారికి పంచప్రాణాలు
అందుకేగా అచ్చువేశారు గాంధిబొమ్మతో నాణాలు
నడుస్తున్నారు వారు పూర్తిగా గాంధీ అడుగుజాడల్లో
అందుకే నివసిస్తున్నారు ఎయిర్ కండిషనర్ మేడల్లో
పాదయాత్ర అంటే వారికి ఎంతో ఇష్టం
కాని కారు లేకుంటే అడుగులేయడం కష్టం
వీరికి సత్యం అంటే చాలా సంతోషం
కాని అసత్యం లేకుంటే నడువదు నిమిషం
పవిత్రత, పరమార్థమే వీరి ధ్యేయం
పడుపు స్త్రీలతో గడుపును వీరి దేహం
గాంధిని ఎప్పుడు తలుస్తారు వీరు
బ్రాందిని ఎల్లప్పుడు తాగుతారు – అది వేరు
కల్లుసారాయి మరువాలన్నారు ఒకసారి
చెట్లసారాయి వగైరాలన్నారు మరోసారి
వారికి తప్పులేదు ఇలాగ అనడం
ప్రజలు నేర్చుకోవాలి వారినోట వినడం

అహింస అంటే వారికి ఎంతో మక్కువ
అందుకేగా తుపాకి కాల్పులు ఎక్కువ
ప్రజల ప్రాణాలంటే ఎంతో ప్రీతి
వారి శవాలపై దాటడమే తమరీతి
బీదసాదలకూ పాటుపడుతున్నా
తమ ఉదరపోషణకై ఆరాటపడుతున్నారు
ప్రజాసేవయే వారి పరమార్థము
పదవుల కోసమే దాని గుడార్థం
గాంధి చెప్పినట్లు తొడుగుతున్నారు ఖాది
రాట్నము త్రిప్పుతున్నారు ఒకరోజైన ప్రతి ఏడాది
దీనితో పూర్తిగా గాంధి సూత్రాలు పాటించినట్టే
సమయస్ఫూర్తిగా నీతి వాక్యాలు వల్లించినట్టే
బాపు అన్నారు Non Possession అని ఆనాడు
గడిస్తున్నారు లక్షలు Position కై ఈనాడు
గాంధీ పై ఉపన్యాసాల్లో ఒలికిస్తున్నారు భక్తి ప్రేమ
వేడుకలు, విందులు, విలాసాలతో చేస్తున్నారు హంగామా
గాంధిని అన్నారు Father of the Nation అని
ఖాతరు చేయరు Nation నాశనమవుతున్నకాని





## 9. మా డి. ఆర్.

మా డి. ఆర్.
మాకెంతో డియర్
మా హృదయాలకు నియర్
మాకందరికీ ప్రియం
అతడు మా ప్రాంగణమున
అడుగిడిన క్షణమున
మా మన:కుసుమములు
వికసించి, విరాజిల్లె
అతడొసగిన విజ్ఞానం
అతడొసగిన పరిజ్ఞానం
మాకందరి సౌభాగ్యం
మాయందరి సౌజన

అతని వియోగం
మాకెంతో బాధ
అతని ప్రయాణం
మాకెంతో వ్యధ
అతని క్షేమం

మేము కోరేది
అతని ఆరోగ్యం
మేము వేడేది
ఆయన నిష్క్రమణం
క్రొత్త డి.ఆర్. ఆగమనం
అందరికీ విదితం
జోగయ్యగారి ఆధ్వర్యం
మాకు జ్యోతిర్మయం
శాస్త్రి గారి ప్రశస్తమైన
ప్రజ్ఞా విశేషం
మాకు లభ్యం
అది మాకు ప్రబలం
ఎల్లరకు లాభం





## 10. గాంధి అడుగుజాడల్లో

బాపు నేడు నీ పుట్టిన రోజు పండుగ
కల్గెను మాకు హృదయాంజలి ఘటించాలని నిండుగ
మేము వేడుకతో చూసితిమి నీ మోము
ప్రణమిల్ల నీ పాదాల పై ముదముతో ఈజాము

కాని నీ ముఖమున గోచరించె ఆగ్రహం
కన్నులలో కనుపించగలేదు అనుగ్రహం
బాపునీకు మాపై కోపమా లేక పరితాపమా
మేము చేసిన పాపములకు ఇచ్చే శాపమా

మేము మా హృదయముల పూర్తిగా పరికించగా
మేము మా చేష్టితముల నవలోకించగా
మాపై రోత మరి ఏహ్యము కుల్గుట నైజము
మాపై కోపము నీకు కల్గుట ఎంతో సహజం

నీవు చెప్పిన నీతి వాక్యములు
నీవు బోధించిన గుణపాఠములు
నీవు చూపెట్టిన జీవితపు విలువలు
నీవు చాటించిన మహామార్గములు

తీసుకోలేదు ఏ మాత్రము అవి లెక్కకు
త్రోసివేశాము విసుగుతో అవి ప్రక్కకు

ఈ మా అపరాధముల ఒప్పుకోక తప్పదు
ఈ నిగూఢ సత్యమును దాచుకోలేము ఇంకెప్పుడు

నీవు సత్యమే మమ్ముల పలుకమన్నావు
సత్వరమే సత్యమార్గాన చరించమన్నావు

మేము నీ ముందు తప్పక తలలెన్నో ఊపినాము
నీవు మాపై నిండుగా కలలెన్నో కన్నావు

కాని, నీవు కన్న కలలన్నింటిని కల్లలుగా చేశాము
నీవు ఏరి తెచ్చిన మల్లెలను మట్టిలో పారేశాము

నీవు చెప్పినట్టు ఒక్క సత్యమైన పలుకలేదు
వాస్తవ మార్గమున ప్రయత్నము లేశమైన చేయలేదు

అసత్యమే నాలుకపై నాట్యం చేసింది
అబద్ధమే మా చర్యలలో నిండుగా చరించింది

అధర్మమే అవలీలగా ఆకాశం ఎగిసింది
అన్యాయమే ఆనందంతో విలయతాండవం చేసింది

బాపూ మరి నీవు చెప్పిందొకటి
మేము చేసింది ఇంకొకటి

నీవు చూపించింది వేరు
మేము నడిచిన తీరు అది వేరు

మేము నీ ముందు ఏమని చెప్పగలము
నాలుకతో పలుకలేము, విప్పలేము గళము





నీవు హింస వద్దని అన్నావు పదే పదే
మరి అహింసముద్దని చెప్పావు అదే అదే

కాని మాకు అహింస నచ్చలేదు ఏ మాత్రం
మా మానసముల మెచ్చలేదు ఈ సూత్రం

అందుకని అహింస అనే హంసను
కసిగా హింసించినాము కలహంసను

కనికర మెంత మాత్రము చూపక
కటిక పాషాణములమైనాము దయచూపక

కేకలు ఎన్నో వేసిన, కష్టపెట్టినాము క్రూరంగా
కన్నీరు మున్నీరైన నష్టపెట్టినాము క్రౌర్యంగా

అమూల్యమైన హంసను హింసించిన పాతకులం మేము
అధమంగా బ్రతికిన దురదృష్ట జాతకులం మేము

బాపూ మేము నీ ముందు నిజముగా నిలువగాలేము
నీ పాదములకు ప్రణమిల్లుటకు అర్హులము గాము

## 11. నెహ్రూ గులాబి

అవని భారతమున
అవతరించెనొక గులాబి
అపురూపముల తోడ
ఆనంద నిలయమున
అందరిలో ఆనందం
అలరారి మురిపించె
అందాల నిన్ను
వడివడిగా వడినించె
నెహ్రూ కుటుంబంకెంతో
న్యూనతను చేకూర్చే
మెతిలాల్ మాన్యులకు
మొగ్గయై వైదొడగె
భారత జాతికెంతో
భవితవ్యం సమకూర్చె
చిన్నారి గులాబి
చురుకైన గులాబి
పెద్ద గులాబియై
పైకి వచ్చింది
వన్నెల్లు తెచ్చింది
చిన్నెలు చిందింది
ప్రసవమ్ములకు నెల్ల
పుష్పరాజమై నిలిచె





ప్రకృతికే ఎంతో
అందాలు చేకూర్చే
తోటలో నిండుగ
పరిమళాలు క్రుమ్మరించె
వనములో ఎన్నెన్నో
సోయగాలు ఒలికించే
ప్రజలెల్లామెచ్చిరి
పండితులేనచ్చిరి
ప్రపంచ జనులెల్ల
పరవశము నొందిరి
పలుదేశాలలో
పేరుమోసి వాసిగాంచె
పలు దిశలయందు
యశములు గురిపించె
ఇలలోనే ఎంతో
విలువైన గులాబి
చలువైన గులాబి
పసందైన గులాబి
ప్రాక్ పశ్చిమమున
ప్రజలను మెప్పించె
శాంతిని చేకూర్చె
సమరముల మాన్పించె
పంచశీలలు అను
పంచామృతములను

పన్నీరు గంధాల
ప్రపంచాని కందించె
పండువెన్నెలలను
పలుమార్లు కురిపించె
శాంతి కపోతముల
శాంతమున ఎగిరించె
భేద భావముల
భ్రమలను తొలగించె
భయముల వదిలించి
విస్మయముల కలిగించె
మానవత్వం నిండిన
మానవుడి ప్రేయసి
మనసైన గులాబి
విలువైన గులాబి
చలువైన గులాబి
దేశానికెంతో
గుణమైన గులాబి
ప్రాణాల నొసగి
పయనించె గులాబి
ప్రజలకన్నుల ముందు
వ్రాలిపోయె గులాబి
ప్రజల గుండె యందు
చిచ్చు రగిలె ఓ గులాబి





## 12. మరపురాని మమతలు

ఏమందును
నేనేమందును
ఎవరో వచ్చిరి
ఎవరో పోయిరి
ఉన్నకాలమునే
పున్నమి చేసెను
హృదిలో ఎన్నో
ముద్రలు వేసెను
ఎదల్లో ఏమో
చిత్రణ చేసెను
కార్యదీక్షతో
వాక్యములు చేసెను
కార్యాలయమునే
ధన్యము చేసెను ॥ఏమం॥

ఫైలు కదిల్చెను
కాగితములు ఎన్నో
కూల్చివేసెను
కట్టలు వ్రాసెను
దిట్టె నిల్చెను
కఠినములన్ని
పఠితముచేసెను
జఠిలములెన్నో
తృటిలో తెంచెను
స్ఫటికము వోలె
స్పష్టము చేసెను ॥ఏమం॥

షైళ్ళు కదిలెను
రైలు కదిలెను
మైళ్ళు కొలది
పయనం చేసెను
సంఘములందు
కుళ్ళు సుదుల్చెను
సహకారమునే
సమన్వయం చేసెను
సమతను కూర్చెను
మమతను కూర్చెను
సుమాలసురభిళ
సౌరభ పరిమళ
పవనములెంతో
ఘుమఘుమ వీచెను ॥ఏమం॥

ధైర్యము వహించెను
స్థైర్యము పెంచెను
కార్యములెంతో
నేర్పుతో చేసెను
ఓరిమి మీరగ
మార్పుల చేసెను
తీర్పుల నిచ్చెను
ఎదగుందకను
వ్యథ చెందకను
కుహనా పథముల
శిధిలము చేసి
ముందు దృక్కుతో





ముందుకు నడిచెను
వత్సరం రోజులు
మత్సరం లేక
ఔదార్యంతో
ఔన్నత్యముతో
పాలవెల్లి వలె
ప్రేమలు పొంగగ
ఒర్చి ఒర్చి
ప్రభలనుమాని
ప్రగతిని చూపెను
పద్ధతి నేర్పెను
జయముల గలుగ
జోగయ్య గారికి ॥ఏమం॥

ధీలాలిత్యంబున
లావణ్యంబున
సోయగాలను
సొంపులనిండి
లక్ష్మికాంతుల
పీఠం చేర్చి
కృష్ణవేణి వలె
కృష్ణారావుల
కరుణార్ఝురుల
కురిపించగను
కలిమియు చెలిమియు
కొలువై యుండగ ॥ఏమం॥

## 13. శ్రావణ మాసం

శ్రావణ మాసము వచ్చె
శ్రావ్యమైన రోజులొచ్చె
కూరిమి వర్షాలు కురిసె
కృష్ణ ఝరులే విరిసే
కృష్ణ ప్రాంతం నుండి
కృష్ణారావు గారు
మా నగరానికొచ్చె
పాలమూరు కేతెంచె
పాటియై ధరనిలిచె
మందమంద గమనమ్ములె
మారుతమ్ములే వీచె
మానసములే పులకించె
ప్రేమానురాగాలే
ప్రభలై భాసిల్లె
అనురాగాలలరంగ
అధికారిగా అతను నిల్చె
అందరిలో ఎంతెంతో
అభిమానముల పెంచె
ఉన్నకాలముల నెల్ల
వెన్నెలను కురిపించె ॥శ్రావణ॥





సహకార రంగమున
సమతను పెంచినవాడు
సమర్థతతో ఆనాడు
సమతను నేర్పినాడు
అనుభవం విలువతో
అవరోధముల త్రుంచి
అభివృద్ధి పంథాల
అధిరోహించిన ధీశాలి
విజ్ఞత గలవాడు
ఉపజ్ఞత గలవాడు
సరసార్థుడైనవాడు
సౌజన్యం వున్నవాడు
విజ్ఞులైన సహకారి
విడిపోవుటే బాధ
వదలిపోవుటే వ్యధ ॥శ్రావణ॥

శ్రీశైల క్షేత్రవాస
శ్రీమల్లికార్జునస్వామి
అగబంగా, ఆత్మలింగా
విస్ఫులింగా, వినుతాంగా
మా అధికారిగాచి
ఆయనను రక్షించు

వినూతునిగా చేసి
పునీతుని గావించు
ప్రౌఢప్రతిభల నిచ్చి
పాలించి లాలించు ॥శ్రావణ॥

పాలెం పురవాస
పరంధామ, పద్మనాభ
శ్రీ వెంకటేశ, ఈశ
శ్రీనివాస, స్థిరవాస
చల్లని వీక్షణములు
అల్లన ప్రసరించే
కృష్ణారావుల గాచి
కష్టముల తొలగించి
ఆయురారోగ్యముల
సంపదల సంతరించు
ఔన్నత్యము చేకూర్చి
ఔదార్యము చూపించు
సుమనస్సుల నీకు చేతు
సమనస్సుల దరిచేర్చు
ఉల్లము ముందుంచెదను
ఉపాయనముగనెంచు ॥శ్రావణ॥





# 14. సభ్యత సంస్కారం

సభ్యత పేరిట
నాగరికత పెరిగింది
సభ్యత చాటున
సంస్కారం అణిగింది
ఫ్యాషన్‌ల సైతాన్
ఆకారంల పెంచింది
దారంల పెంచింది
హారంల నిలిచింది
నిజాయితీలపై
ఎంతో చిరిగింది
నిలువలేక నీతినిలిచె
ఓటమికి తలవంచె
సత్యం, శాంతం రెండు
సౌఖ్యం వదిలివేసె
ధర్మాన్ని దేవతలు
ధాత్రి వదలి కదలిపోయే
దారిద్ర్యం మితిమీరె
ధనికులే ధనవంతులైరి

ధరలెంతో పెంచిపెంచి
దొరలుగా రాణించిరి
సభ్యత పరదా వెనుక
దగాకోరులే దాగిరి
ముఠాకోరులెల్లరును
ముసుగుతో ముందొచ్చిరి
రాజకీయ నాయకులే
రాణించిరి వినాయకులై
రాజి భేదాలు చేత
పంచుకొనిరి పదవులను
ప్రజాసేవా దురంధరులై
పైకొచ్చిరి పతితులెల్ల
చిల్లర మూకల లేపిరి
కల్లోలం, కలహాలు
కలహభోజుల కడుపునింపె
పైసాకై సాయన్న
ప్రశ్నయొకటే ముందుంది
పవిత్రత, పరమార్థం
పనికిమాలినవైపోయే
మాట, మూటలను





బాటిల్స్‌తో నిల్పవచ్చు
మనీ, మానినీలతో
ఘనముల సాధించవచ్చు
స్నేహితులెంతెక్కువున్న
సోషల్ మనిషంటారు
క్లబ్బులలో కలుసుకున్న
కౌగిలించుకుంటారు
పేకాట, ఇంట బయట
ఒంటబట్టపోయినవి
సభ్యతకు చిహ్నంగా
నగ్నత ఎక్కువయ్యె
సభ్యత పేరిట ఎంతో
అసభ్యత తేలివచ్చె
నవ్యత పేరిట ఎంతో
అపసవ్యత పైకొచ్చె
సభ్యత గల సంఘమే
వ్యంగ్యంగా వెక్కిరించే
నియమ నిష్ఠలను
నిక్కముగా ధిక్కరించె

## 15. పేదవాడు

పేదవాని బ్రతుకు
అంబటి గంజి గతుకు
పూరింటి గుడిసె నివాసం
మాపటికి లేదు గ్రాసం
చెమటోడ్చి చేయును కష్టం
ఆకలి తీరదు కనిష్ఠం
చిక్కిన, చితికిన దేహం
నిరాశ, నిస్పృహ, నిరాహం
సత్యం, న్యాయం, ధర్మం
తెలియదు ఏమిటో మర్మం
సత్యం ఆయన సొత్తు
పనికిరాదు విత్తు
అతనికాస్తి నాస్తి
మరేంలేదు జాస్తి
అతనికెల్లప్పుడు అప్పు
అదే ఆయనకు ముప్పు
జీవనసమరమే భారం
బతుకు పోరాటమే నిత్యం





ఆడితప్పడు ఇచ్చినమాట
అదే సంతరించిన మూట
మాటకై పడును పాటు
చేయడు ఎన్నడు పొరపాటు
పరులతో ప్రేమగనుండు
హృదయం నిండుగ ఉండు
వాంఛలు లేని యోగి
కాడు లాలస భోగి
కామం చేరదు దరికి
ఎదలో లేదు మురికి
మోసం, ద్వేషం తెలియదు
రోషం, ఆవేశం నడువదు
నీతినిజాయితి వదలడు
ధర్మం విడిచి కదలడు
లేడు ఇలలో ఇంతటి యోగి
కాదుకాదు కర్మయోగి

## 16. విద్యార్థి సోదరా

విద్యార్థి సోదరా
విద్య నార్జించు
విద్య నార్జించి
అవిద్య వర్జించు
తిమిరాంధకారముతో
సమరము సాగించు
అజ్ఞాన ఇరులను
పరంగా పంపించు
చీకట్లను చీల్చి
చురుకుగా నడుపు
దీపాలే వెల్గించు
దివ్వేలే రగిలించు
వెలుగులే వెలిగించు
వెన్నెలే కురిపించు ॥విద్యార్థి॥

చదువు నేర్చుటే
నీ మనోరథము
మనోరథమెప్పుడు
మరువొద్దు నీవు
వత్యపెట్టి నిన్ను
మళ్ళించే వారుంటారు
మహిలోన ఎందరు
మరుగున గలరు
మనుష్యుల యందు





మోసపోవద్దు
పెడదారి పట్టి
పెద్దరికం చేయొద్దు
భక్తి శ్రద్ధలతో
భక్తిని పెంచు
భోగముల వదిలేసి
త్యాగముల పెంచు ॥విద్యార్థి॥
దుష్ట భావమ్ముల
దరికి రానీకు
దుష్ట సహవాసంబు
అంతమొనరించు
చెడు అలవాట్లను
చెంత రానీయకు
ప్రేమ భాషణ మిన్న
సద్ భూషణంబు
ప్రేమనే పెంచును
మానవత్వమే నించు
బాధ్యత గమనించు
భేదముల ఛేదించు
భవితవ్యము గాంచి
భావనల నిర్మించు
జాతిని గురించి
లెస్సగా యోచించు
నీతిని రీతిగా నీలోన నించు
దేశ ప్రేమల నుంచు
దోషముల త్రుంచు ॥విద్యార్థి॥

# జానపదోక్తి కవితలు



## 1. బాలి

బాలి వస్తనంటె
బంగుల గట్టిపిస్తి
బాలి రాకపాయె
బంగుల కూలిపాయె ॥బాలి॥

బాలి కోసమని
బేకైన చీరగొంటి
బాలి రాకపాయె
బేరము చెడిపాయె ॥బాలి॥

బాలి వస్తదాని
బలుబాగ మురిసిపోతి
బాలి రాకపాయె
నా బతుకు చీకటాయె ॥బాలి॥

## 2. నా నాగి

సందమామ వెన్నెలలోన
సలువైన పందిటిలోన
సరసాలు యాడుతుంటే
నీవు చేసినసైగేమి
నా వన్నెల నా నాగి ॥సంద॥

నెత్తిమీద నీళ్లకడవ
చీటిచీర సింగులెక్కువ
నడివీధి ముందు నడిచి
ననుజూచి నగితివేమో
నా వన్నెల నా నాగి ॥సంద॥

రేగిచెట్ల వరుస నీడ
రేకుల బంగ్లాకాడ
రోసాలు మేర మేర
నీవు చేసిన బాసేమి
నా ముద్దుల నా బావా ॥సంద॥

వొందురోని బాయికాడ
ఒరిచేను ఒడ్డుమీద
ఒంటిగ కలిసినాతో
చంటిమీద గీసిందేమి
నా ముద్దుల నా బావ ॥సంద॥

కాటుక కండ్లదాన
కందిరీగ నడుముదాన
కనుబొమ్మ లెగిరించి
కనుగీటిన సైలేమో
నా వలపుల నా నాగి ॥సంద॥





## 3. రంగైన రంగి

జామపండ్లు తెచ్చి నా రంగి
జాముకే నీకిస్తి నా రంగి
దోసపండ్లు కోసి నా రంగి
దాసుకాతెచ్చిస్తి నా రంగి ॥జామ॥

కలకొండకే వెళ్ళి నా రంగి నీకు
కమ్మలైనా గొంటి నా రంగి నీకు
కుమ్మెర జాతర్లో నా రంగి నీకు
కోరిన చీరలు తెస్తి నా రంగి ॥జామ॥

సంరంభం తోడనారంగి నీకు
సొమ్ములే జేపిస్తి నారంగి
పట్టు వస్త్రాలెన్నో నారంగి నీకు
పట్టెమంచాలెన్నో నా రంగి ॥జామ॥

బలెమురిపెముతోన నా రంగి నీకు
బంగులా గట్టిస్తి నా రంగి
అందాల మేడలో నా రంగి నీవు
అపురూపమకన్నెవే నా రంగి ॥జామ॥

నీ రూపమే జూసి నా రంగి నేను
నిలువునా నీరైతి నా రంగి
నీ సోగసూపులే నా రంగి
నాలోన మెరిసేనే నా రంగి ॥జామ॥

నీ తలుకు బెలుకులే నా రంగి
నా మనసు చిలికెనే నా రంగి
బంగారు వన్నెల నా రంగి నీ
సింగారమే మందు నా రంగి ॥జామ॥

సొగసైన కళ్ళదాన నా రంగి
నీ సొగసంత ఇచ్చిపోవే నా రంగి
రంగుల రంగులతోడ నా రంగి
రింగురింగున రావే నా రంగి ॥జామ॥





## 4. నా గంగి

గలగల నవ్వింది నా గంగి
నన్ను గమ్మత్తు సేసింది నా గంగి
కిలకిల నవ్వింది నా గంగి
నన్ను కదిలించి వేసింది నా గంగి ॥గల॥

నాతో గంతులే ఏసింది నా గంగి
చకచక నడిసింది నా గంగి
సక్కని రూపంలో నా గంగి
చిక్కగా నవ్వింది నా గంగి ॥గల॥

నన్ను పెక్కుగా సూసింది నా గంగి
నా మనసులో నిలిసింది నా గంగి
కమ్మగా పాడింది నా గంగి
నన్ను రమ్మని వేడింది నా గంగి ॥గల॥

సూటిగా సూసింది నా గంగి
సోకుగా మెరిసింది నా గంగి
ప్రాయములో నున్న నా గంగి
నా ప్రాణమై నిండింది నా గంగి ॥గల॥

నవ్వులను ఎగజల్లె నా గంగి
పువ్వులను ఎదజల్లె నా గంగి
కొంటె సూపులతోనే నా గంగి
కోరికల రేకెత్తె నా గంగి ॥గల॥

నిండు వయసు బాల నా గంగి
నిండు మనసు 'బేల' నా గంగి
ఎదమీద ఎదబెట్టి నా గంగి
సొదలెన్నో సెప్పింది నా గంగి ॥గం॥

మనసును ఇచ్చింది నా గంగి
నా మనసును దోచింది నా గంగి
వయస్సును ఇచ్చింది నా గంగి
నా మనసును దోచింది నా గంగి ॥గం॥

నాజూకు నడుముతో నా గంగి
నాట్యమేసేసింది నా గంగి
కాటుక కండ్లతో నా గంగి
కనుసైగ చేసింది నా గంగి ॥గం॥

సుద్దులే చెప్పింది నా గంగి
ముద్దులే ఇచ్చింది నా గంగి
తీరులే సూపింది నా గంగి
తేనెలే కురిపించె నా గంగి ॥గం॥

సరసాల తేలించె నా గంగి
మురిపాల మురిపించె నా గంగి
నిన్ను మరువగలేనే నా గంగి
నిన్ను వీడగలేనే నా గంగి ॥గం॥





## 5. నాగి

నాగులపల్లి సంతలోన
నాగి నాకూ కల్సింది
నాగి ఆగి, నాతో కల్సి
నవ్వినవ్వి మురిసింది ॥నాగు॥

ముద్దులొలుక ముందుకొచ్చి
ముచ్చటేమో సెప్పింది
ముచ్చటలను సెప్పిసెప్పి
ఆశలెన్నో రేపింది ॥నాగు॥

కొంటెగా సూసినన్ను
కన్నుసైగ సేసింది
సైగలను చేసి చేసి
సెగలను రేపింది ॥నాగు॥

మాపటికి వస్తానని
మాటనాకు ఇచ్చింది
వస్తానని అన్నందుకే
వళ్ళు జలదరించింది ॥నాగు॥

ప్రేమలేమో తెలియని
నన్ను ప్రేమలోకి దించింది
ప్రేమలను నేర్పినాకు
ప్రాణమై పోయింది ॥నాగు॥

# 6. వలచింది

వలచిందిరా భామ వలచింది
పిలిచిందిరా భామ పిలిచింది
నా చెరను వీడక నిలుచుంది
నా చెంత తిరుగుతూ
నా పంచనే ఇక నిల్చుంది ॥వల॥

రంగు రంగుల తీరు సూపింది
చెంగుచెంగున భామ ఎగిరింది
కొంగుచాటున వున్న
పొంగును మరి చూపి
లేపింది నన్ను రేపింది ॥వల॥

కన్నుల సైగలు భామసేసింది
కన్నుల్లో కన్నులు కల్పింది
అందాల భామ వచ్చింది
అందాలన్నీ అరవిచ్చింది
ఇచ్చి నాతోనే కల్సిపోయింది ॥వల॥

కంగారులో సూసింది నన్ను
సింగారం ఒలికించి
బంగారు చేతులతో
మందారమాల వేసింది
మందహాసముల విరిసింది ॥వల॥